శ్రీమద్గురవే నమః



# అఖండానంద బోధయను

# అన్నావధూత అనుభవ ప్రకాశిక

ప్రథమభాగము



* ఇది *

అన్నావధూత స్వాములవారిచే

రచియింపంబడి




గుండా భూమయ్యగుప్త కార్యదర్శిగారిచే

భూలక్ష్మీ ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురింపంబడియె

హైదరాబాద్ (దక్కన్.)

౧౯౩౦

శ్రీరాజరాజేశ్వరాయనమః

సర్వవేదసార జనితానర్ఘళ సంసారతరణియనంబరగు

# అఖండానందబోధయను

# అన్నావధూత అనుభవ ప్రకాశిక

ప్రథమ భాగము.

ఇందు రాజేశ్వరశతకము. హంసశతకము. గురువాక్యతారాళి.

అఖండానందబోధార్థ, అద్వైత కందార్థ దరువులు.

శివజ్ఞానాష్టకస్తోత్రం చరమానుష్ఠానము.

ఇవి

శ్రీమత్పరమహంసాది బిరుదాంకితులగు, శ్రీమత్పరమభూమానందయోగీంద్ర,

## అన్నావధూత స్వాములవారిచే

సర్వజనులకు కైవల్యప్రాప్తిజెందచేయుసటుల రచియింపంబడి

సచ్చిదానంద వేంకటేశ్వర అవధూతస్వామివారిచే సవరింపంబడి

బ్రహ్మశ్రీ గోరావర్ఘుల-రామకృష్ణ దేసిక స్వామివారి ప్రియశిష్యులైన

## గుండా భూమయ్య గుప్త కార్యదర్శి గారిచే

యి. భూలక్ష్మీ ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురింపంబడియె.

హయిదరాబాద్ దక్కన్.

ప్రమోదూతనామ సం॥ ఆశ్వీజ శు॥ ౧౫ అంగారకవారము

 డి॥ ౭ అక్టోబర్ ౧౯౩౦ దీనివెల రూ॥ ౧.

# ప్రకటన

సద్గురుపుత్రులారా ! సత్పురుషులారా !

యీ పత్రిక ప్రథమ భాగము నేటికి సంపూర్తియై వెలువడినది. తిరిగి రెండవ భాగము ప్రారంభించి, వెల్లడించ ప్రయత్నించు చున్నారము గాన చందా దారులు త్వరలో చేరుటకు ప్రార్థితులు.

ఇట్లు బుధజన విధేయుడు,

గుండా భూమయ్య గుప్త కార్యదర్శి.

# NOTICE;

సకలజనులకు యిందువలన తెలియజేయడం యేమనగా

ఈగ్రంధము మా॥రా॥రా॥ శ్రీ, ఘనతవహించిన నైజాం గవర్నమెంటువారి శాసనమునుబట్టి రిజిష్టరు చేయబడియున్నది గనుక,

కం॥ అదిగావున నితరులుయీ !

సదమలగ్రంధంబు నచ్చుసల్పగదగదా ।

విధిమీరి యచ్చునిడిన ।

వ్యధ తగు నష్టంబటంచు భావింపుడికన్ ॥

ఈగ్రంధము వలయువారు ఈక్రింద చేవ్రాలు చేయువారిపేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ఇట్లు,

గుండా భూమయ్య గుప్త

కేరాఫ్.— కే. పిరయ్య పేపర్ మర్చెంట్,

గోల్ బంగ్లా హైదరాబాద్ దక్కన్.

కార్యదర్శిగారిని ప్రోత్సాహపరచి వ్రాయబడిన పద్యరత్నములు
బోధానంద కోటా వెంకటస్వామి కృతం

సీ॥ శ్రీమదఖండలక్ష్మీప్రసన్నంబైన । ధరశికిందార్బాదు పురవరమున
వాశిగాంచిన, ఆర్యవైశ్యకులాగ్రణి । గుండ, వంశాబ్ధి చంద్రుండనంగ
వెలసె, భూమయ్య సద్వేదాంతనిపుణుండు । ధాతృత్వశీల సద్ధర్మగుణుడు
గౌరవఝ్ఝుల రామకృష్ణదేశికపాద । పంకజసేవతత్పరుడు ఘనుడు
గీ॥ సావధానముచేత, యవ్వావధూత । యనుభవమునుప్రకాశింప మనమునందు
కోర్కెజనియించి, గ్రంథముల్ గూర్చియచ్చు । పడగ జేసెను బుధజనుల్ భళిరె
యనగ ॥

గజ్జలకొండ సమీప అనంతవరాగ్రహార నివాసులు
అభినవబాణాకవి ఆశుకవిచక్రవర్తి
గౌరావఝ్ఝుల రామకృష్ణ సీతారామసోదరకవులు
శతావధానులకృతం

మ॥ సరసీజాసనవంశవార్ధిశశిర । చ్చంద్రుండు వేదాంత స
చ్చరితానూనసుధారసామరధునీ । సంక్షాళితాశేషధీ
వరఘోరాఘుడు, సచ్చిదాత్ముడు, జగ । ద్వంద్యుండు, యుష్మన్మహో
గురురాజమ్మెత, యెల్లకోరికలనీ । కున్ బ్బానుయూర్జోత్తమా ॥

సీ॥ వైశ్యోత్తములులేరొ వరధనధాన్యభా । గ్యాఢ్యూఢిగలవారులేరుగాని
ధనధాన్యభాగ్యవర్ధనులులేరో దాన । ధర్మతత్పరులుంట తరుచుగాని
దానధర్మార్థతత్పరులు లేరో వేద । విద్యావిశారదు ల్వెలితిగాని
వేదాంతవిద్యాప్రవీణులులేరొకో । అనుభవవేత్తలౌ టరుదుగాని
గీ॥ బళిరెపంకజసూతియిప్పగిది సకల । సద్గుణంబుల నొకచోట సరిగగూర్చి
సృష్టిగావింపబోలునిన్నిష్టసిద్ధి । నాశ్రితనిధాన గుండభూమాభిధాన ॥

సీ॥ శ్రీరామకృష్ణశాస్త్రి కృపావలుండుని । శ్శంకమైనిజనాదినంతరించి
అవ్వావధూతాద్య హంకారరహితవా । క్యామృతధారల ననలుసైచి
బహుశిష్యజనహిత ప్రవచనారూఢినా । నాకథుబంధముల్ దాకబెరిగి

గ్రంథావలోకనబంధురధిషణాని । బంధనకుసుమ సుగంధమెసఁగి
గీ॥ సచ్చిదానందమనియెడు స్వాదుఫలము । పండియుండినసజ్జ్ఞాన వల్లికల్ప
వల్లిగతినెల్లదిక్కుల వెల్లివెలసి । యాశ్రితులనేలుగాత భూమార్యవర్య ॥

సీ॥ గురుపాదభక్తి సంభరితుఁడీవనుటకు । శ్రీరామకృష్ణదేశికుఁడుసాక్షి
పండితాదరణతత్పరుఁడవీవనుటకు । ప్రీతిమైసూర్న్యవధూతసాక్షి
వేదాంతవిద్యాపరిపోషుఁడీవనుటకు । దావకసత్ప్రబంధములుసాక్షి
సిరిసంపదలకెందు కొఱంతలేదనుటకు । సరిసమంబైనకాపురమెసాక్షి
గీ॥ కవులసత్కారమొనరింపఁగడగెదవన । యాశ్రయించినసత్కవీంద్రాళిసాక్షి
మిత్రజనవత్సలుఁడవనమేమెసాక్షి । సాక్షులున్నారు పద్యంబు చాలదోయి ॥

శా॥ నానాటంగృశియించి విస్మృతినిజెందన్ సిద్ధమైయున్న బ్ర
హ్మానందైకలతామతల్లికను, । శిష్యవ్రాతచిత్తాలవా
లానన్నిల్పి, వచస్సుధారసము । జాలన్నింపిపోషించి ప్ర
జ్ఞానంబన్పలమందినాఁడవు । బళీ! సద్వైశ్యచూడామణీ ॥

యం - భాస్కర కవికృతం

సీ॥ అఖిలాండకోటి బ్రహ్మాండభాండములకా । ధారమౌవిష్ణుదేవరుణిభర్త
సకలచరాచర జంతుజాలంబుల । గల్పించుబ్రహ్మయే కలికికొడుకు
త్రైలోక్యములు పవిత్రంబుజేయగబారు । గంగాభవానియేకాంతపుత్రి
లోకబాంధవుసదా లోకసప్రీతిచే । వెలయుపద్మంబులే వెలదియిండ్లు
గీ॥ నట్టిసిరిప్రోచుగాత నిరంతరంబు । వరసికిందర బాదాఖ్యపురవరంబు
నుండుగుండాన్వయాబ్ధి చంద్రుండనంగ । నమరుభూమన్న వైశ్యరత్నంబునకెలమి ॥

గోరావఝల రామకృష్ణదేశిక ప్రభువరకృతం

క॥ ఆయుష్యమునారోగ్యము * పాయనిభాగ్యంబుభూరి * బలమును శుభముల్
వేయువిధంబులగలుగును * నాయంబుగనీకుభూమ * యాఖ్యాభిఖ్యా ॥

క॥ వనజాసనుడాయుష్యము * దినకరుడారోగ్యమధిక * దేవుడునీకున్
జననుతమగునైశ్వర్యము * ఘనభక్తుండనుచునిచ్చి * కరుణింతురొగిన్ ॥

గౌరావఝ్ఝుల రామకృష్ణ సీతారామ సోదరకవుల యాశీర్వాదము

# కార్యదర్శి



## శ్రీ-అ-ప-గుండా భూమయ్య గుప్త

శా॥ జ్ఞానాంభోధి, రమావినోది, త్రిజగ । త్కళ్యాణుడంభోజగ,
ర్భానీకామరవందితాంఘ్రియుగళుం । డార్యావరాప్తుండు, ల
క్ష్మీనారాయణుఁ డెల్ల కాలము యశ । శ్రీవర్ధిలంజేసి బ్ర
హ్మానందంబిడి బ్రోచుఁగాత, నినుభూమయ్యా! బుధగ్రామణీ ! ॥

యీ గ్రంథంబు నాదరించిన మ॥ రా॥ రా॥ శ్రీ చందా దార్లు.

* శ్రీ మత్పరమ భూమానంద యోగీంద్ర *

* శ్రీ మదనావధూత స్వామి వారి శిష్యోత్తములు;*

శికిందాబాద్ దర్కార్

౧ పోలకం దామెర క్రిష్టన్న గారు జనరల్ బజారు.

౨ సిలి కాటారం విఠోబ గారు కంటాౖక్టర్ బోచరు బజారు.

భోనగిరి నగరం వారు.

౩ బచ్చు పరమయ్య శ్రేష్ఠిగారు.

౪ గంగిశెట్టి నారాయణ శ్రేష్ఠిగారు.

౫ గంగిశెట్టి హనుమయ్య శ్రేష్ఠిగారు.

౬. మంచాల నారాయణ శ్రేష్ఠిగారు.

౭ కొకొండ లింగన్న శ్రేష్ఠిగారు.

౮ బెల్లె హనుమయ్య శ్రేష్ఠిగారు.

౯ చకినాల రాజయ్య శ్రేష్ఠిగారు.

౧౦ చామ లింగయ్య శ్రేష్ఠి గారు.

౧౧ కూరెళ్ల సోమయ్య శ్రేష్ఠిగారు.

౧౨ మురారిశెట్టి నరునయ్య శ్రేష్ఠి గారు.

౧౩ జంగం కోట్కొండ గారు.

౧౪ చెన్నకేశ్వర శేషయ్య దాసుగారు, సాకిన్ జగ్గయ్యపేట హాల్. ముకాం. భోనగిరి.

శ్రీమత్స్వాన లక్ష్మణ కౌశిక ప్రభువరు సచ్చిష్యమండలి.

౧౫ శ్రీమత్పగడాల శ్రీసచ్చిదానంద వేంకటేశ్వర స్వామివారు అవధూత సాకిన్ చిత్తూరు.

౧౬ వెల్లపల్లి లక్ష్మయ్యగారు ఆడిటాఫీసు క్లర్కు సదరుబజారు బొలారం.

౧౭ బచ్చు యెల్లయ్యగారి రామయ్య శ్రేష్ఠిగారు బేగంపేట హాల్ ముకాం భోనగిరి.

హయిదాబాద్ దర్కార్

౧౮ నూకాల నిరబ్రహ్మం గారు. ఫీల్ఖాన.

యీ. గ్రంథంబు నాదరించిన మ॥ రా॥ రా॥ శ్రీ చందా దార్లు.

౧౯ అందా మల్లయ్య గారు కిషన్‌గంజ్.

౨౦ పసుపులేటి రామస్వామినాయుడుగారు, సబ్ పోష్టుమాష్టర్ అబ్జల్‌గంజ్
శికిందాబ్రాద్ దక్కన్.

౨౧ బి. రుద్రమూర్తి నాయుడు గారు పుప్పరిగూడెం.

౨౨ ఘారా శివన్న గారు నల్లగుట్ట.

౨౩ కపులా బాలయ్య గారు కంట్రాక్టరు. రిజిమింటల్ బజారు

౨౪ నారం అనంతస్వామిగారు ( అఖండ పరిపూర్ణ బోధానంద )

౨౫ కొండోజి సీతారాములుగారు: కుమ్మరిగూడెం

౨౬ కుంకుమ మల్లయ్య గారు. పాట్‌జారు.

౨౭ లింగా నారాయణ శెట్టిగారు. బెగంపేట హాల్ ముకాం పాట్‌బజారు.

౨౮ యే. ఆర్. సుబ్బారావు నాయుడుగారు. మూసాఖాన్ బజారు.

శ్రీసచ్చిదానంద వేంకటేశ్వరస్వామి వారి నిజ భక్త మండలి.

౨౯ మందిప్పల హనుమంతరావు గారు భూమానంద రాజయోగి
శికిందాబ్రాద్. హాల్. ముకాం కంబ్బంమెట్టు.

30 అంకెనపల్లి. రామస్వామి. గారు కవాడిగూడెం

3౧ బి. రాంశింగ్ గారు. దీక్షానామం శ్రీనిశ్చలానంద.
మల్లికార్జునపేట బెజవాడ.

3౨ వుడుతా యల్లయ్యగారి కుమారుడు శంకరయ్య శెట్టిగారు.
కంసాజి బజారు శికిందాబ్రాద్

33 బ్రహ్మశ్రీ మంగళారం శివయ్య గారు ( మయుబ్రహ్మ వారి )
లాల్ దర్వాజ. హైదరాబాద్

శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగి గారి నిజ భక్త మండలి.

3౪ అబ్బుగారి వీరయ్యగారు దీక్షనామం శ్రీనిశ్చలానంద ఋమాంభావి.

3౫ బండి రామస్వామి గారు బ్రహ్మానంద రాజయోగి పోలీసుకానిస్టేబిల్
పెనుగొండ తిన్నకు తాలూకా కృష్ణా జిల్లా.

3౬ కేసన వీరయ్యగారు దీక్షానామం[ నిర్మలానంద] కోట్టుఅమీర్.
యిస్లాంపేట. బెజవాడ.

యీ.గ్రంథంబు నాదరించిన మ॥ రా॥ రా॥ శ్రీ చందా దార్లు.

---

శ్రీమదచలగురుడు పేర్ల కోదండ రామ దేశిక ప్రభువరు శిష్యోత్తమ మండలి

౩౭ దావతు వాసుదేవు జెనార్ధనం గారు [ఆయుర్వేద వైద్యభూషణ] గౌలిగుడెం హాయిదాబాద్ దక్కన్

౩౮ చలవాది అంతయ్య గారు, తెజాప్ గర్ చుడి బజారు. డిటో

బృహద్వాశిష్ఠ సిద్ధాంత నిర్ధారణులగు మదుపు సుబ్బయాచార్య శిష్య ప్రశిష్య మండలి.

౩౯ గరిగ మాణిక్యంగారు దీక్షానామం (అభేదానంద) కృష్ణాజిల్లా రేపల్లె తాలూకా మోతత్ శిష్యమండలి

౪౦ అంగడాల సోమయ్య నాయుడు గారు. దీక్షానామం [బ్రహ్మానంద] షుబేదార్ మేజర్. బహదూర్ బెజవాడ.

మోతత్. శిష్యమండలి.

౪౧ నాగోతి వెంకన్న గారు. దీక్షానామం. [చిదానంద] రాజయోగి. నేటివ్ డాక్టరు బెజవాడ.

శ్రీమదాదిరాజ. తిరుమలరాయ సార్వభౌముల వారి శిష్యమండలి

౪౨ రావుల చన్నయ్యగారు. ఆప్కారి కంట్రాక్టరు బెజవాడ

౪౩ కే. వి. నారాయణస్వామి. పిళ్లె నేటివ్ డాక్టరు. శికింద్రాబాద్.

౪౪ రంగా వెంకరయ్య శ్రేష్ఠిగారు. కండ్లకోయ బజారు. డిటో

౪౫ పుట్టా నరసింహ్మంగారు సుబ్రిమకోర్టు డిటో

శికింద్రాబాద్. దకన్

౪౬ చేవెండ్రి గోపాల్. రావు. శర్మగారు జనరల్ బజారు.

౪౭ ఘనాతే సదాసివు. చిత్తారిగారు. రంగ్రీజిబజారు.

౪౮ లింగా సుందరయ్య. శ్రేష్ఠిగారు బాలాజిటెంపిల్ స్ట్రీట్

౪౯ కట్టా రాఘవులుగారి రామయ్య శ్రేష్ఠిగారు దాల్ బజారు.

ఈ. గ్రంథంబు నాదరించిన మ॥ రా॥ రా॥ శ్రీ చందా దార్లు

౫౦ అల్లాడి రామన్నగారి కొమారుడు యాదగిరి శ్రేష్ఠిగారు, బారింపటాలంవీధి.

౫౧ గుండా లింగన్నగారి కృష్ణమూర్తి గుప్తగారు, బారింపటాలంవీధి.

—*( హైదరాబాదు )*—

౫౨ కిన్నర వెంకటసుబ్బయ్యగారు, సాతుచెంగన్నవీధి, కడప కోట.

౫౩ మద్దెల వీరభద్రప్పగారు, సాకీ తాడిపత్రి జిల్లా అనంతపురం.

౫౪ లింగ్గం శెట్టి రామయ్యగారు, సాకీ ప్రొద్దుటూరు.

౫౫ దుగ్గరాజు కోదండరామయ్యగారు, జ్యూట్ మిల్లు అవుడ్ ఫోరు గుమాస్తా కృష్ణాజిల్లా, ఏలూరు.

౫౬ దోగుపర్తి స్వామిగుప్త సిద్ధాంతిగారు సాకీ వేటపాలెం బాపట్లతాలూకా గుంటూరు జిల్లా.

౫౭ శ్రీనివాసరెడ్డి వురఫ్ రామచంద్రారెడ్డిగారు ఖైరాబాద్.

౫౮ యామా వీరన్న శ్రేష్ఠిగారు సాహు, సాకీ బేగంపేట.

౫౯ మొగుడంపల్లి మల్లయ్య శ్రేష్ఠిగారు, డిటో

౬౦ వడెగర్ రామోస సన్యాసిగారు కత్రి సాకీ చెర్లపల్లి, జిలె నల్గొండ తాలూకె, భోనగిరి.

౬౧ తారక పోతాజిగారు, సాకీ రామపల్లి, జిలె మెదక్, గుల్షనాబాద్.

౬౨ యాంసాని రామయ్య శ్రేష్ఠిగారు, సాకీ తాలూకె మేడ్చెల్, జిలే హైదరాబ్ బల్ద.

౬౩ అకుల యేసుకొండలు శెట్టిగారు, కత్రల వ్యాపారము, నె ౧౬౫-౧౬౬ తంబుశెట్టివీధి మదార్సు

౬౪ మార్గని సూర్యనారాయణగారు, [ వివేకానంద ] రాజయోగి లక్ష్మివార పేట రాజమహేంద్రవరము.

## యీ. గ్రంథంబు నాదరించిన మ॥ రా॥ రా॥ శ్రీ చందా దార్లు

పసుల బాలయార్య రాజయోగిగారి ప్రియశిష్యులు.

౬౫ గర్రెపల్లి రామన్నగారి కొమారుడు వెంకటేశం (శెట్టిగారు, సాకిన్ మిరుదొడ్డి తాలూకా శిద్దిపేట జిలె మెదక్, టప్పాఖాన మిరుదొడ్డి.

పబ్బోజి వెంకన్న ( త్వష్ట బ్రహ్మచారి ) గారి కొమాళ్లు సాకిన్
శిద్దిపేట జిలె మెదక్

౬౬ పబ్బోజి దుర్గయ్యగారు.

౬౭ పబ్బోజి నాగేశంగారు.

౬౮ పబ్బోజి రాజయ్యగారు.

౬౯ పుప్పల రామలింగంగారి కొమారుడు గాతయ్య శెట్టిగారు సాకిన్ రామంచ హాల్, ముకాం, తాలూకా శిద్దిపేట జిలె మెదక్.

౭౦ కొమురవెల్లి జోగయ్యగారి రాజేశం శెట్టిగారు సాకిన్ తాలూకా శిద్దిపేట.

౭౧ మెలమంచిలి నరసమ్మగారు దీక్షానామం [ పూర్ణానంద ] సాకిన్ కొణికి రేటూరు తాలుకా కృష్ణాజిల్లా పెదపాడు పోష్టు.

శ్రీ గోళ్ల బుచ్చిరాజావధూత స్వాములవారి శిష్యవరులు.

౭౨ మేకా తిరుపతయ్యగారి కొమారుడు కాశయ్యగారు, సాకిన్ [ ఆచంట ] నర్సాపురం తాలూకా ఆచంట పోష్టు.

౭౩ పులిగి వెంకట క్రిష్ణయ్య గౌడుగారు ముస్తాజర్ కలాలి ఖైరతాబాద్.

౭౪ భూమి భాగ్యరెడ్డిగారు భజనిక్ వేదాంతి దేశభక్త రిసాలబజారు బొల్లారం.

శ్రీమద్ గోవిందవఝ్ఝుల వెంకటరామాచల గురుసార్వభౌములవారి
ప్రియశిష్య రత్నములు.

౭౫ వెంపటి లక్ష్మీనరసింహస్వామిగారు విజయనగరం.

యీ గ్రంథంబు నాదరించిన మ॥ రా॥ రా॥ శ్రీ చందా దార్లు.

౨౬ రాజులదేవి నరిశింలుగారు టెలిఫోన్ ఆఫీస్ కాచిగూడ హైదా్రబాద్.

కొండలరాయత్సిదానంద స్వాములవారి ప్రియశిష్యరత్నములు.

౨౭ బాదె రామయ్యగారు, రశీద్నిబజారు హాయిదా్రబాద్ దక్కన్.

౨౮ యస్. వేలాయుదం మొదల్యార్ గారు, బ్రిగెడాఫీసు, బాఘాయిద రైటర్ షక్షేమెదాన్ హాయిద్రాబాద్ క్కన్.

శేషావధూత స్వాములవారి ప్రియ శిష్యరత్నము.

౨౯ గోపాల్ హనుమంతుగారు, చుడిబజారు హైదా్రబాద్ దక్కన్.

బండి రామస్వామి బ్రహ్మానంద రాజయోగిగారి ప్రియ శిష్యరత్నము.

౩౦ మానంతసెట్టి రంగయ్య గారు, సాకిన్ తాడేపల్లిగూడెం పశ్చిమ గోదావరి జిల్లా.

హైదా్రబాద్ దక్కన్.

౩౧ కలబొర్గు వీరయ్య శ్రేష్ఠిగారు, అక్బర్జాబజార్.

౩౨ కె. గోపాలస్వామి నాయుడుగారు [ నేటివ్ డాక్టర్ ] అబ్జల్ గంజ్ రోడ్ చమన్ హాయిదా్రబాద్ దక్కన్.

౩౩ గడ్డం, కృష్ణారెడ్డి గారు, రసిడెన్శి బజార్ రాంకోటి హాయిదా్రబాద్ దక్కన్.

సికిందా్రబాద్ దక్కన్.

౩౪ ఠేనుగుల నరిసింలుగారు శ్రీకండు చెట్మిబజారు.

౩౫ నాగిళ్ల వీరయ్య శ్రేష్ఠిగారు.

౩౬ చీలా హనుమయ్య అంతయ్య శ్రేష్ఠిగార్లు.

# అవతారిక

అన్నావధూతగారను ప్రసిద్ధనామము వడసిన

శ్రీమత్ పరమభూమానందయోగీశ్వరులు వీరు వేపూరు వంశోద్ధారకులగు నృసింహశాస్త్ర్యులకు వెంకమాంబయందు ఈశ్వరవరప్రసాదమున జనించినవారు తలిదండ్రులు వీరికి యన్నయయను నామమిడి పుత్రవాత్సల్యముచే మిక్కిలి గారాబముగా పెంచుచు చిన్నతనముననే వీరికి విద్యాభ్యాసము నొసంగిరి వీరు తలిదండ్రుల యెడ మిక్కిలి అనుకువ గలవారై చక్కగా చదువుకొనుచు కనపర్తి సాంప్రదాయకులచే వేదాధ్యయనమును పొంది ఋగ్వేదమును చక్కగా పఠించునంతటి వారై ఉదరపోషణార్థమై తిరుమలగిరియందు రాజ్యాంగ స్వేతజులకై నూతనముగా నిర్మించు భవనములయందు టైంకీపరుగా జీవనోపాధిని కుదుర్చుకొనియుండ నంత కొన్ని దినములకు ఆగిరి ఋషియో లేక యక్కడి వనదేవతయో వీరికి దర్శనమివ్వ వీరికిదివరకావేశించిన యజ్ఞానమునువదలి జ్ఞానసంపన్నులై వైరాగ్యముగల్గి పెద్దల సేవజేయ కల్యాణినగర సమీపస్థిత ఉమ్మాబాదయను గ్రామమునకు జ్ఞానవేత్తలైన శ్రీమాణిక్యప్రభువుగారి దర్శనార్థమై వెళ్లుచుండ మార్గమధ్యమున నొక యూరిలో నొకగృహస్థునింట యతిథియయి యతడొసంగిన యాతిథ్యమును గ్రహించి మార్గాయాసము దీర్చుకొనునట్టి సమయమున యాగృహాధికారి తనగృహిణీసమేతుడై యాయూరి వెలుపలిగుహలో నేకాకియైయున్న నొకమహాత్ముని దర్శించుటకై ఫలపుష్పాదులగొని వాడుకగాపోవురీతిని ఈయతిథునకు తెలుపకయే పోవుచుండ వీరు మిక్కిలిరహస్యముగా నిట్టి నిసీథసమయమునపోవుట కేదో యొక కారణముండునని తలచి వారికి తెలియకుండా వారివెంటనంటి పోనుపోను వారు గుహాంతఃప్రవేశించ వీరును ప్రవేశించి వారికగుపడనటుల మరుగుగానుండ నప్పుడా ధర్మదంపతులాగుహావాసియగు నొక మహాపురుషుని దర్శించి వారిని అర్ఘ్యపాద్యాది షోడశోపచారంబుల నర్చించి వారివల్ల అనుగ్రహపూర్వకముగా లభించిన మహాప్రసాదము నంగీకరించుసమయమున దాగియున్నవీరు ధైర్యసాహస

ములుగలవారై యామహాత్మునియెదట కాన్పించి ప్రణామంబాచరించి ప్రసాదమును
గ్రహింపుమని వినయవిధేయతగా ప్రార్థింప నందుకు వారు సంపూర్ణ కరుణా
కటాక్షముచే ప్రసన్నులై ప్రసాదంబునుగ్రహించినంత వీరఖండజ్ఞానసంపన్నులై ఆశ్ర
మస్వీకారమువహించి యక్కడినుండి బయలుదేరి ఉమ్మాబాద మొదలైన దివ్యస్థల
ములలోయున్న యనేక పెద్దలనుదర్శించుకొని పునః స్వగ్రామమగు సికింద్రాబాదు
నకు విజయముచేసినవారై లోకోపకారార్థమై యనేకచోట్ల యనేక పురాణములను
సర్వజనసమ్మతముగా నుడువుచు సర్వజనులకు జ్ఞానమార్గమును దెలుపుచు పెద్దలను
శిష్యుగారతకెక్కి ప్రబలులై యున్నంత ప్రజోత్పత్తినామ సం॥ ఆషాఢ శు॥ ౧౫ భాను
వాసరమునకు సరియయిన ౧౮౭౧ సం॥ జూలై ౨-వ తేదిన శైవబ్రాహ్మణులు
తపఃపండితారాధ్య గురువరు పీఠమునకు ముఖ్యులనుగా శ్రీస్వామి మంత్రిలింగా
రాధ్య ప్రభువరుని కాశ్రమస్వీకారమునొసంగి ప్రముఖులనొనర్చు తరుణమున వీరు
రా॥ వేలూరి మునుస్వామినాయుడుగారును, యదువంశప్రవిష్టులగు జ్ఞానవేత్తల
యిన మధుసూధనాఖ్య కృష్ణమాచార్య, పేరిగేశణలచే నాటిరోజున యిరుపార్శ్వము
లయందు చామరములువీవ పగటికాగడములచే అనేకశిష్యజనులు వెంటనంటి
జయధ్వనులెసంగ బహువిధ భేరి మృదంగ శృంగి మొదలగువాద్య విశేషములచే
బహువినోదమెసగ శిష్యులనునటుల ఊరేగింపబడిరి ఇట్టితరుణమున బ్రహ్మశ్రీ అచ్యు
తరామశాస్త్రీగారు వీరికిసహాయభూతులయి వీరికిగల జ్ఞానసంపత్తికి ప్రమోదితు
లయిరి. ఈరోజులలో ఇదివరకు కొన్నిదినములుగా గ్రామసంచారార్థమై శికింద్రా
బాదునకు వేంచేసియుండి బిక్షవడయుచున్న శ్రీస్వామి శంకరాచార్య శృంగేరి
స్వాములవారిచే వీరు పిలుపింపబడి మీరవధూతలెటులయితిరో దెల్పుమన అందుకు
సమాధాన పూర్వకమైన ఈ క్రింది సీసపద్యము నుడివి వారివల్ల మిక్కిలిగౌర
వింపబడిరి.

సీ॥ ఏపాదయుగములు నెప్పుడువిడువక ♦ శ్రీదేవితాసేవ జేయుచుండె
ఏపాదములుసోకి యిలమీదబండయయి ♦ పడియున్న యాహల్యపడతియయ్యె
ఏపాదతీర్థంబు నెప్పుడు పార్వతీ ♦ పతితలధరియించుపరమనియతి
ఏపాదయుగములుయిలమీదనటియించ ♦ అవనిభారంబెల్లనణగిపోయె

నట్టిపాదంబునందునే నవతరించి ♦ దేశికేంద్రునిసత్కృపాదృష్టిచేత
బోధరూపుండనైయాత్మభోగమ్మంది ♦ దురితములుద్రుంచి అన్నావధూతనైతి ॥

తదుపరి వీరు శికిందాబ్రాదునుండి బయలుదేరి వారణాసికివెళ్లి యక్కడి విశ్వేశ్వరుని దర్శించి వేదోక్తముగా యభిషేకంబొనర్చు సమయమున వీరి కులగోత్రముల నక్కడిపండితులు విచారించి నీవిట్లొనర్చుట కనధికారివని నుడివి వాదింపదొడంగిన సందులకు వీరు యొక మహాపండిత సభగావించినయెడల తమయధికారమును స్థిరపరచెదనని ప్రత్యుత్తరమిచ్చినంతలో యక్కడి అధికారులు వీరిగంభీర వాక్యసరళికచ్చెరువంది యనంతరంబొక మహాపండిత సభగావింప నందలి పండితులు వీరియఖండ విద్యాప్రావీణ్యతకు మెచ్చుకొని సర్వవిధముల పరిక్షించి యక్కడనే వీరికీక్రింది శ్లోకరూపమైన బిరుదొసంగిరి.

శ్లో॥ అఖండభూమండల । సాధుమండనో
బృహద్వశిష్టాన్వయ । సింధుచంద్రమా:
విద్యానిధిస్త్వత్వసు । భూషణోజ్వలో
హ్యన్నావధూతాత్మ । విరాశిభూమణిః ॥

యక్కడినుండిబయలుదేరి జబల్పూరు, సాగరు, జగన్నాథం, బరంపూరు, రాజమహేంద్రవరము, విజయనగరం, విశాఖపట్నం, కాకినాడ, బందరు, గుంటూరు కంబంమెట్టు, భద్రాచలం, వేములవాడ, ధర్మపురి, శ్రీశైలం, కడప, కర్నూలు గుత్తి, బళ్లారి, బెంగుళూరు, చాందా, మొదలగు దేశములయందనేక శిష్యులగైకొని తమబోధ నెల్లెడల వెల్లడిజేసి తమశిష్యులకు బోధించుచు యిటులనే ముమ్మారు కాశియాత్రజేసి పదునెనిమిది వత్సరములుగడిపి యాత్రాపూర్తి సమయమున కడపకేతెంచి యక్కడిపీఠమునకు యొకశిష్యుని యధికారిగా నియమించి యక్కడ కొద్దిరోజులుండి వ్యాధిగ్రస్తులై తిరిగి స్వగ్రామమగు శికిందాబ్రాదునకు వేంచేసి పదిదినములవరకు సజీవితులై పదునొకండవదినము విరోధినామ సం॥ మార్గశిర శు॥ ౮ శనివారం రోజున పగలు 3 గంటలకు కైవల్య పదవిజెందిరని లోకులెల్లరచే పొగడబడుచున్నారు. వీరు రాజరాజేశ్వరి యుపాసకులు.

① [illegible] 30-11-1889

# ఇది తమ మిత్రులకు జూపుడు

## విజ్ఞాపన

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది బిరుదాంకితులును, శ్రీమద్బ్రహ్మవిద్యాశిష్ట శిద్ధాంతనిర్ధారణులునునగు, శ్రీమత్పరమ భూమానంద యోగీంద్ర శ్రీమదన్నావధూత స్వామివారి ప్రభావకీర్తి, యనుభవాదు లెల్లరకును తెల్లంబే కదా, యీతత్స్వాములవారు తమ యనుభవమునుసూరి, భక్తపామర బృందములకు హస్తామలకమగునటుల సమస్త పామర కోటిని కటతేర్చు మార్గప్రదర్శకముగా, యీగ్రంధములను రచియించిరి వీటిని ప్రథమభాగముగా ముద్రింపనైనది తిరిగి రెండవ భాగమందు ముద్రింపబడు గ్రంధములు.

1. గురువాక్య సుధారసము.
2. వాగ్భూషణము.
3. పరబ్రహ్మానంద విలాసము
4. ఉపదేశ రత్నమాల.
5. పంచవింశతి పరమ తత్వములు.

ఈ గ్రంథంబుల నన్నింటి నొకచోటచేర్చి ముద్రింపించి

## అఖండానంద బోధయను అన్నావధూత అనుభవ ప్రకాశిక

యను నామంబుచే రెండవభాగము ప్రచురింపబడును. చందా రు॥ 1-0-0 ముందు చెల్లించవలెను. లేదా 8 అణాలు అడ్వాన్సుగా పంపవలెను చందాదారుల నామధేయములీ గ్రంథంబున ముద్రింపబడును. యీగ్రంథమును అభిలాషించువారలు కార్యదర్శిగారికి తమతమ విలాసమును పూర్తిగా తెలుపవలెను. యీగ్రంథములను వీ. పి. మూలమున పంపబడును వీ. పి. చార్జి ప్రత్యేకము.

ఇట్లు బుధజన విధేయుడు,

గుండా భూమయ్య గుప్త కార్యదర్శి

కందార్థము.— శ్రీకరుడగు నారాయణు * డాకాశమువలె నెపూర్ణమై * వెలుగుచుతా * సాకల్యముగను సూర్యుని
కీకీలెఱిగించెదని * నెరిగుండారయ్యా * యిది దెలసితె * మఃలి రారయ్యా * యెరుకమరుపు
లరెంట్ని * యొరిగేటియెరుకాను * పరిపూర్ణముగ జేసె * పావనమగు బోధ * నెరిగుండారయ్యా॥

శ్రీ భాస్కరగురుడు



శ్రీమదాదినారాయణుడు



శ్లో॥ భాస్కరంభావయేనిత్యం । భక్తాభీష్టప్రదంగురుం ।
అచలవిద్యాప్రదాతారం । బ్రహ్మవిష్ణుశివాత్మకం ॥

శ్లో॥ నారాయణంమహావిష్ణుం । విశ్వాతీతంజగద్గురుం
సచ్చిదానందరహితం। సర్వపూర్ణం నమామ్యహం ॥

కందార్థము — ఆరవియా గురుబోధను* నారయుగా యాజ్ఞవల్క్య* కమలముగాగ* ధీరత నొసగిననా
తడు* కారణముగ జనకపతికి* కరుణతో నిచ్చే* శ్రీగురువకతెడు శరణాని హెచ్చే* అరమార
లేకయిట్లా జనకుడు మది* మరువాక శుకలాకు* మరియు చలబోధను* కరుణతో నిచ్చే॥



శ్రీ యాజ్ఞ్యవల్క్య మహర్షి



జనక మహా రాజు

శ్లో॥ నమామియాజ్ఞవల్క్యాంతం । జనకాజ్ఞాననాశకం।
అర్కప్రియంచిదానంద । బ్రహ్మాసంలగ్న చేతసం॥

శ్లో॥ జనకంత్వత్రధర్మేణ । పాలయంతంనిజాః ప్రజాః ।
తథాప్యధ్యాత్మికీంవిద్యా । బోధయంతంనమామ్యహం॥

కందార్థము—శుక యోగీంద్రుం డెప్పుడు*ప్రకటీతముగ పూర్ణుడయ్యె*భావములోనఁ*సకలం బాత్మ
మయంబని*అకళంకముతోడనుండు*టదివినివచ్చీ*సాందీపులు మదిలోన హెచ్చీ*ముదము
తోశుక యోగి పదయుగములుబట్టి*వదలక యీబోధ*వాశిగా తాబొందు*టదివినివచ్చీ॥

శ్రీ సాందీపమహాఋషి



శ్రీ శుకమహాఋషి



శ్లో॥ సాందీపనఃగురుంవందే। శ్రీకృష్ణాల్లబ్ధపుత్రకం।
శ్రీశుకజ్ఞానదీపేన। నిరస్తాఖిలతామసం॥

శ్లో॥ వేదార్థతత్త్వవిమలంనిజబోధరూపం। తత్త్వామృతంసిజజ
నాయవిదీయమానం। వ్యాసాత్మజంజననుతంహరిపాదపద్మే
సంలగ్నచిత్తమనిశంశుకమాశ్రయేహం॥

కందార్థము — శ్రీకృష్ణుండీబోధను * ప్రాకటముగ బొందితాను * పరిపూర్ణుండై * చేకొని రుక్మిణి దేవికి * సాకల్యముగాను దెల్పె * సమరసజ్ఞానం * సంతసమూన * విమలసుజ్ఞానం * కమలా శ్రీధరునకు కరుణా చేసిమర్మ * మమలంబుగా యచల * మగునట్లుగా దెల్పె * సమరసజ్ఞానం ॥

శ్రీ రుక్మిణీదేవి

శ్రీ కృష్ణపరమాత్మ

శ్లో॥ రుక్మిణీం రుక్మవర్ణాభాం । శ్రీకృష్ణాత్మానురంజనీం ।
వందేహం విబుధస్తుత్యాం । వాంఛితార్థప్రదాయినీం ॥

శ్లో॥ ఇందీవరదళశ్యామ । మిందిరానందకందళం ।
వందారుజనమందారం । వందేహం యదునందనం

కందార్థము—— స్వామిశ్రీధర గురువరు * డేమాయల బొందకుండ * నెపుడతడుండ * రామావధూతివచ్చియు
యామాహాత్మ్యమునుజూచి యచ్చెరువుగానూ * గురునకు మనసిచ్చె గానుకనూ * స్వేచ్ఛా
మగనుభోధ కృపజేయుమని వేడా * నిచ్చెయవధూతకు నీమహాగోప్యము * యచ్చెరువుగాను॥






కంధార్థము—రామావ ధూతవద్దను * స్వామిసదా నందయోగి * సమ్యజ్ఞానం బేమాయలేక బొందియు * కామాంధుల మార్గమెల్లా ఖండించెలెస్సా * వాదిభవమూల దండించెలెస్సా * అండాబాయని వెంకటార్యుల కీకీలు * దండిగాదెల్పిన ధరనుమూర్ఖులబోధ * ఖండించెలెస్సా * వాదిభవమూల దండించెలెస్సా ॥

శ్రీ వేంకటయోగి



శ్రీ సదానందయోగి



శ్లో॥ బృహద్వాశిష్ఠసిద్ధాంత । పరతత్వోపదేశిక
వేంకటేశ్వరం యోగీంద్ర । సద్గురుభ్యోన్న మోనమః ॥

శ్లో॥ శ్రీమత్సదానందమచిత్యమవ్యయం । శ్రీమత్సదానందమఖండమద్వయం । శ్రీమత్సదానందమనంతమచ్యుతం
శ్రీమత్సదానందగురుం స్మరామి ॥

కంధార్థము

వెంకట యోగీంద్రుని పద * పంకజములు గొలచియాత్మ * పరిపూర్ణంబై
సంకటము లెల్లవదలియు * శంకలుడిగి నీకృతినిగ చేసేనయ్యా * జన్మము
లాను బాసీనానయ్యా * ఆశాలువొదలిన యన్నావధూతను * వాసిగ
శ్రీగురు వరునకర్పించినే * జేసెదనయ్యా * జన్మములాను బాసీనానయ్యా



## భూమానంద అన్నావధూతస్వాములవారు

సీ॥ ఏపాదయుగములు నెప్పుడువిష్ణువక ఽ శ్రీదేవితాసేవ జేయుచుండె
ఏపాదములుసోకి యిలమీదబాడరైయె ఽ పడియున్న యా హల్య పడతియయ్యె
ఏపాదతీర్థంబు నెప్పుడు పార్వతీ ఽ పతితలధరియించు పరమునియతి
ఏపాదయుగములు యిలమీద నటియించి ఽ అవనిభారంబెల్ల నడగిపోయె
నట్టిపాదంబునంమనే నవతరించి ఽ దేశికేంద్రుని సత్కృపాదృష్టిచేత
బోధరూపుడనై యాత్మభోగమంది ఽ దురితములు ద్రుంచి అన్నావధూతనైతి॥

* శ్రీమద్గురుసహాయం *

# గురుపరంపరాభివర్ణన

శ్లో॥ శ్రీబ్రహ్మవిద్యాగురువిష్ణుసూర్యౌ । శ్రీయాజ్ఞవల్క్యం జనకం శుకం చ
సాందీపకృష్ణంరుక్మిణీంచశ్రీధరం । వందేగురుస్మద్గురుపాదుకాంతం॥

శ్లో॥ నారాయణంమహావిష్ణుం । విశ్వాతీతంజగద్గురుం
సచ్చిదానందరహితం । సర్వపూర్ణంనమామ్యహం॥

శ్లో॥ భాస్కరంభావయేనిత్యం । భక్తాభీష్టప్రదంగురుం
అచలవిద్యాప్రదాతారం । బ్రహ్మవిష్ణుశివాత్మకం॥

శ్లో॥ నమామియాజ్ఞవల్క్యంతం । జనతాజ్ఞాననాశకం
అర్కప్రియంచిదానంద । బ్రహ్మసంలగ్నచేతసం॥

శ్లో॥ జనకంక్షత్రధర్మేణ । పాలయంతంనిజాఃప్రజాః
తథాప్యాధ్యాత్మికీంవిద్యాం । బోధయంతంనమామ్యహం॥

శ్లో॥ వేదార్థతత్వవిమృషంనిజబోధరూపం
తత్వామృతంనిజజనాయవిదీయమానం
వ్యాసాత్మజంజననుతంహరిపాదపద్మే
సంలగ్నచిత్తమనిశంశుకమాశ్రయేహం॥

శ్లో॥ సాందీపనంగురుంవందే । శ్రీకృష్ణాల్లబ్ధపుత్రకం
శ్రీశుకజ్ఞానదీపేన । నిరస్తాఖిలతామసం॥

శ్లో॥ ఇందీవరదళశ్యామ । మిందిరానందకందళం
వందారుజనమందారం । వందేహంయదునందనం॥

శ్లో॥ రుక్మిణీంరుక్మవర్ణాభాం । శ్రీకృష్ణాత్మానురంజనీం
వందేహంవిబుధస్తుత్యాం । వాంఛితార్థప్రదాయినీం॥

# గురుపరంపరాభివర్ణన

శ్లో॥ శ్రీధరస్వామినం నిత్యం । బోధకారణ మవ్యయం
భావాతీతమహం వందే । సుఖజ్ఞానైకవిగ్రహం ॥

శ్లో॥ శ్రీసచ్చిద్ధర యోగివర్య । చరణప్రోత్ఫుల్ల పద్మాంచిత
జ్ఞానాజ్ఞానవిహీనబోధ । మధుపాత్సంచార సంతారితాః
యేశుద్ధాచల మార్గతత్పరజనా । స్తేషాం సకాశాగతం
ప్రాప్తోపితభయోభవం యదిహత । త్పాదాంబుజం చాశ్రయే ॥

శ్లో॥ పరమాద్వైతసిద్ధాంత । ప్రజ్ఞాబోధోపదేశిక
రామావధూత యోగీంద్ర । సద్గురుభ్యో నమో నమః ।

శ్లో॥ యస్యబోధోదయాత్సర్వం । బ్రహ్మైవేత్యవగమ్యతే
రామావధూతవిఖ్యాతం । తద్దైవతముపాస్మహే ॥

శ్లో॥ శ్రీమత్సదానంద । మచింత్యమవ్యయం
శ్రీమత్సదానంద । మఖండమద్వయం
శ్రీమత్సదానంద । మనంతమచ్యుతం
శ్రీమత్సదానంద । గురుం స్మరామి ॥

శ్లో॥ బృహద్వాశిష్ఠసిధాంత । పరతత్వోపదేశిక
వేంకటేశ్వర యోగీంద్ర । సద్గురుభ్యో నమో నమః

శ్లో॥ శ్రీరాజయోగకులవారధి పూర్ణసోమం
శ్రీవేంకటేశపదపంకజ చంచరీకం
శ్రీపూర్ణబోధపరతత్వ మహాత్ప్రకాశం
అన్నావధూతగురువర్య మహం భజామి ॥

శ్లో॥ వేపురాన్వయసంజాతం । వేదాన్తామ్బుజభాస్కరం
వేంకటాచార్యగురోశ్శిష్యం । వసిష్ఠాచార్య మహం భజే ॥

# SPECIAL BALM,

## Once Try & Always Ues,

## ఇక యేనొప్పులకును భయపడనక్కరలేదు.

మాయొద్ద నుండెడు **స్పెషల్‌బామును** వాడి చూడుడు.

ఎంతటి తలనొప్పులైనను లేకుండ జేయును ఎంతటి పార్శ్వపు నొప్పులైనను రూపుమాపును ఎంతటి వాయుపోట్లైనను పోగొట్టును ఎంతటిదగ్గునైనను యుగ్గడంచును.

ఎంతటి వాపులనైననేమి! ఎటువంటి దురదనైననేమి! ఎట్టి అరిసెమొలలనైననేమి! క్షణకాలములో తొలిగించును.

సర్వనొప్పులకు వజ్రాయుధము వంటిది. స్వదేశీ వస్తువులతో చేయబడినది

## జి. ఆర్. మూర్తి అండ్ కంపెని,

అఫ్జల్‌గంజ్ రోడ్, హైదారాబాద్ దక్కన్.

---

## ప్రకటన.

శ్రీశివరామ దీక్షితాచల గురుపీఠ వేదాంత గ్రంథములు

౧ శుద్ధనిర్గుణతత్వైకందార్థానేక సదృష్టాంత పత్రికాశిక ఐదుసంచికలు వకచోట చేర్చి మేలైన బైండు చేయబడియున్నవి బైండుచార్చి సహా వెల రు ౩-౮-౦

౧ భాగవతుల కృష్ణదాసుగారి అధ్యాత్మలు తత్వములు వెల రు ౧-౦-౦

౧ బ్రహ్మావిద్యా సూచనము వెల రు ౦-౨-౦

౧ సద్గురుభక్తశతకము పంచీకరణిసాంఖ్యతత్వము వెల రు ౦-౪-౦

౧ యెరుకకురంజి వేదాంత యక్షగానము వెల రు ౦-౪-౧

౧ గురుశిష్య సంవాదము ద్విపద వెల రు ౦-౮-౦

వలయువారు ఈ క్రింది విలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును కె. వీరయ్య పేపర్ మర్చంట్ నె. ౫౮౮౫ హయిదారాబాద అఫ్జల్‌గంజ్ రోడ్ గోల్‌బంగ్లా పోలీస్ సదరమీనకచేరి సమీపమున.



శ్రీ గురుభ్యో నమః

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాయ నమః

# రాజేశ్వర శతకము,

శ్లో॥ ఓంనమోగురునాథాయ । రాజరాజేశ్వరాయచ ।
బోధానందస్వరూపాయ । భూమానందాయతేనమః ॥

శ్రీ రాజరాజేశ్వరా * పార్వతీ * చిత్తవిమరుహాభాస్కరా
కారణాచార్యవర్యా * మద్గురవే * కరకంఠరాజేశ్వరా ॥ ౧

నీపాదయుగములెపుడూ * నామనో * నీరజమునందునునిచీ
కాపాడవయ్యనన్నూ * నీపూర్ణ * కరుణచేరాజేశ్వరా ॥ ౨ ॥

నిన్ను నేనమ్మినాను * యితరుల * నెన్నడును నేనెరుగనూ
అన్నియును నీవంచునూ * నాత్మలో * నెన్నెదనురాజేశ్వరా ॥ 3 ॥

శరణుపార్వతినాయకా * హరహరా * శరణుమోక్షప్రదాయకా
శరణోజగన్నాయకా * శివశివా * శరణార్థిరాజేశ్వరా ॥ ౪ ॥

సచ్చిదానందరూపా * మాంపాహి * సర్వజ్ఞసర్వేశ్వరా
నీచిదంశంబుగాదె * జగమెల్ల * నిక్కంబురాజేశ్వరా ॥ ౫ ॥

నాతల్లితండ్రినీవే * నాదాత * నాప్రాణధనమునీవే
ఖ్యాతిగానమ్మినాను * నీవెగా * గరకంఠరాజేశ్వరా ॥ ౬ ॥

అన్నియునునీవెయయ్యా * యీజగము * లన్నిటికిసాక్షివయ్యా
యన్నియేమియులేకనూ * నీవుందు * వచలమైరాజేశ్వరా ॥ ౭ ॥

నీమతత్వంబుదెలియా * బ్రహ్మాది * నిర్జరులవశముగాదు
వేదాంతవేద్యులెల్ల * బ్రహ్మంబు * వండ్రునినురాజేశ్వరా ॥ ౮ ॥

నీయందుమూలప్రకృతి * జన్మించ్చి * నిక్కముగ రెండాయనూ
మాయయూవిద్యయంచూ * శృతులెల్ల * మరిబల్కు రాజేశ్వరా ॥ ౯ ॥

ఆమాయలేనిదయ్యా * నీయందు * నిఖిలంబుగాన్పించునూ
నీమాయదాటుటకునూ * వశమౌనె * నెవరికినిరాజేశ్వరా ॥ ౧౦ ॥

మాయతోసహగూడి * శివుడవై * మహిమచేవిశ్వంబునూ
జేయుదువు పాలింతువూ * లయమును * జేయుదువురాజేశ్వరా ॥ ౧౧ ॥

నీవుసృష్టిని జేయగా * బ్రహ్మయని * నినుబొగడు వేదంబులూ
నీవుపాలనజేయగా * హరివయ్యు * నేలుదువురాజేశ్వరా ॥ ౧౨ ॥

నీవులయమును జేయగా * వర్ణించు * నిటలాక్షుడనుచుశృతులూ
నీవెసర్వంబునకునూ * దేవు డవు* నిక్కమౌరాజేశ్వరా ॥ ౧౩ ॥

వవిద్యనుగూడగా * దేవుడని * నిర్ణయించెను వేదముల్
గావుననుజీవేశులూ * నీవెగా * గరకంఠరాజేశ్వరా ॥ ౧౪ ॥

యీతత్వమెరుకలేకా * మూఢజను * లీశజీవేశులకునూ
ఖ్యాతిగాభేదమనుచూ * దలచినను * గాంచరోరాజేశ్వరా ॥ ౧౫ ॥

భేదవాదులకెల్లనూ * నీవెపుడు * భేదములుగాన్పించుతువూ
భేదరహితులకెల్లనూ * విడువకను * పొందుదువురాజేశ్వరా ॥ ౧౬ ॥

నీమాయదెలియవశమా * నితరులకు * నిక్కమిట్టిదటంచునూ
కామాంధకుడనునేనూ * నిన్నెట్లు * గాంచగలరాజేశ్వరా ॥ ౧౭ ॥

మాయయనవెట్టిదనగా * తన్నుతా * మరచిపోవడమెకాదా
నీయందుభక్తిగల్గు * వాడౌను * నీరూపురాజేశ్వరా ॥ ౧౮ ॥

ఆవరణవిక్షేపమూ * లనుశక్తు * లమరంగతానాయనూ
ఆవరణమనగమరుపే * యనిశాస్త్ర * మనుగదారాజేశ్వరా ॥ ౧౯ ॥

స్థూలసూక్ష్మములచేతా * నిఖిలమయి * చూడ్కులకుగానబడుచూ
కాలంబుగడుపుచుండూ* ప్రాణులకు * గరకంఠరాజేశ్వరా ॥ ౨౦ ॥

పుత్తతాడునుజూచియూ * పామనుచు * పణికిభయమందినట్లు
చిత్తమునమీయందునా * గాన్పించు * జగమెల్లరాజేశ్వరా ॥ ౨౧ ॥

చిత్తంబుగాకే గియున్న * సర్వంబు * చిత్తమందేగలుగునూ
చిత్తంబులేకున్ననూ * లేదొక్క * చింతైనరాజేశ్వరా ॥ ౨౨ ॥

చిత్తమనుమర్కటంబు * నన్నెపుడు * చంచలంబులఁబెట్టగా
ఖ్యాతిగానీయుండునా * నామనసు * వొప్పదోరాజేశ్వరా ॥ ౨3 ॥

మూలప్రకృతివల్లను * జనియించె * ముందుమహాతత్వమూ
చాలగాదానందునా * హాంకృతియు * జనియించెరాజేశ్వరా ॥ ౨౪ ॥

రాజసముసాత్వికమూ * తామసము * రమ్యముగతానాయనూ
యీరాజనములేగుణములో * మిణిగితా * మెరుగరోరాజేశ్వరా ॥ ౨౫ ॥

హాంకారనుందుబుట్టి * పంచభూ * తాది ప్రపంచమెల్ల
హాంకారమునజనములూ * నినుదెలియ* రాత్మలోరాజేశ్వరా ॥ ౨౬ ॥

నేనాయహంకారమూ * ననుగూడి * నిలజన్మములనెత్తుచూ
మానాభిమానములనూ * విడువకను * మరిగితినిరాజేశ్వరా ॥ ౨౭ ॥

యెన్నెన్నిజన్మములనూ * యెటువలెనె * యెత్తితినోనేనున్నా
అన్నటనుదుఃఖమేనూ * కారణం * బాయనోరాజేశ్వరా ॥ ౨౮ ॥

యిప్పటికినాచిత్తమూ * విడువకను * తప్పుడుమార్గములనూ
నొప్పగాదిరుగుగాని * సద్ధర్మ * మొప్పదోరాజేశ్వరా ॥ ౨౯ ॥

పరులద్రవ్యములందునూ * నామనసు * పరువులిడుచునుండునూ
పరభామలనుజూచినా * నిలువకను * భ్రమలొందురాజేశ్వరా ॥ 3౦ ॥

చాపల్యములజెందియూ * నామనసు * చాంచల్యమొందుచుండూ
కాపట్యములకునెల్లా * తామూల * కారణమురాజేశ్వరా ॥ 3౧ ॥

ఆశలనుత్రాళ్లచేతా * నన్నుతా * నరికట్టుకొనియున్నదీ
యీశరీరంబునందూ * భ్రాంతితా * నిడువదోరాజేశ్వరా ॥ 3౨ ॥

చక్కగానిన్నెరుగకా * భ్రాంతిలో * చిక్కినేపాపములనూ
మక్కువతోనగణితంబూ * జేశితిని * మన్నించురాజేశ్వరా ॥ 33 ॥

జననమాదిగనేటికీ * నేనైతె * జేసినవిదోషములనూ
మనసుదులెక్కపెట్టా * నలవానె * మన్నరవెరాజేశ్వరా ॥ ౪3 ॥

యిప్పటికినాచిత్తమూ * నినుగొల్వ * నొప్పదేమి శేతునూ
చెప్పిచూపంగరాని * కృత్యములు * జేసితినిరాజేశ్వరా ॥ ౩౫ ॥

ఐననాకేమిభయము * నేజేయు * యపరాధముల నెల్లను
పూనినివెరుగవటవే * బ్రహ్మాది * పూజితారాజేశ్వరా ॥ ౩౬ ॥

సకలంబునీవంచునూ * వేదాంత * శాస్త్రములుబల్కుచుండా
అకలంకనీకన్ననూ * నేనువే * రౌదునారాజేశ్వరా ॥ ౩౭ ॥

జీవుడేయీశుడంచూ * యుపనిష * త్సూక్తులుబల్కుచుండా
భావింపశాస్త్రములునూ * నిటువలెనె * బల్కునోరాజేశ్వరా ॥ ౩౮ ॥

అన్నిటనునీవుండియూ * నివుజేయు * చున్నటైగాన్పించునూ
అన్నియునుసున్నయైన * నీ వొకడ * వుందువోరాజేశ్వరా ॥ ౩౯ ॥

పరమాత్మపరమేశ్వరా * గౌరీశ * పతితపావనశంకరా
పరమబోధస్వరూపా * సర్వేశ * పరిపూర్ణరాజేశ్వరా ॥ ౪౦ ॥

బైటచూచెడిచూపునూ * లోపలికి * భద్రముగమళ్లించియూ
నయనద్వయంబుమధ్యా * మరిచూడ * నగుగదారాజేశ్వరా ॥ ౪౧ ॥

కిందుజూచెటిచూపునూ * శాంతముగ * పొంగుగాపైనజూడ
సందేహములుదీరునూ * నీవెగతి * సర్వజ్ఞరాజేశ్వరా ॥ ౪౨ ॥

రెండొక్కటయినయపుడే * అంతటను * నిండియాఖండమయ్యా
పండువెన్నెలతీరునా * వెలశెదవు * పరమాత్మరాజేశ్వరా ॥ ౪౩ ॥

సంకల్పమొదలకున్నా * నిటువలెను * సాదించ్చవలయుగానీ
సంకల్పరహితునకునూ * బనిలేదు * సాధనలురాజేశ్వరా ॥ ౪౪ ॥

గురుకటాక్షంబుచేతా * తా మొదటి * గుణములన్నియునదలియూ
పరమాత్ముడనుచుగురునీ * సజ్జనుడు * భావించురాజేశ్వరా ॥ ౪౫ ॥

గురునినరుడనియెంచెడీ * జనములకు * కుటిలహంకారములనూ
అరనిముష మొదలకుండా * మరిమరి * న్నలయించురాజేశ్వరా ॥ ౪౬ ॥

గురునిహరుడనియెంచెడీ * ఆసత్య * గుణశిఖామణులకెల్లా
హరహరాయెందుజూడా * నీవెయూ * నందంబురాజేశ్వరా॥ ౪౭ ॥

నీతత్వమెరుగకుండా * తనలోన * నిన్నుదలపోయకుండా
ఖ్యాతిగాదిరుగుచుండే * గురువులే * కోతులోరాజేశ్వరా ॥ ౪౮ ॥
ఆశలుడుగనిగురుడునూ * లోభంబు * కోశివెయ్యనిశిష్యుడూ
యీశయీయుభయులెపుడూ * ధరలో * పిశాచులోరాజేశ్వరా ॥ ౪౯ ॥
తన్నుతాదెలియకుండా * యితరులకు * తత్వంబులెల్లదెలుపూ
పన్నుగానాగురువులే * జగమునను * పశువులోరాజేశ్వరా ॥ ౫౦ ॥
మలమూత్రయోనులందూ * జన్మించి * మరణంబునొందుచుండ్రూ
కలనైననిన్నుజనులూ * గాంచకను * గరకంఠరాజేశ్వరా ॥ ౫౧ ॥
సకలయోనులబుట్టుచూ * నెక్కుపుడు * సర్వేశనిన్నుమదిని
యకళంకముగగొల్చియూ * మానవుం * డైపుట్టురాజేశ్వరా ॥ ౫౨ ॥
మానవుండైనవాడు * నినుమదిని * మరువకనుభజియించెనా
పూనివానందుకరుణా * నుంచుదువు * పూర్ణముగరాజేశ్వరా ॥ ౫౩ ॥
నీకటాక్షంబుగల్గా * జనములకు * నిద్దంపు భక్తిగల్గా
ప్రకటంబుగభక్తిచే * జ్ఞానంబు * ప్రబలమౌరాజేశ్వరా ॥ ౫౪ ॥
జ్ఞానంబుచేజూడగా * అంతటను * గాన్పింతువొకడవినె
మానాభిమానములనూ * విడచునా * మాన్యులకురాజేశ్వరా ॥ ౫౫ ॥
నీదుతత్వామృతమునూ * పానంబు * నిక్కంబుగాజేయుచూ
మోదముననిన్నుబొంది * యాతండు * ముక్తుడౌరాజేశ్వరా ॥ ౫౬ ॥
నీవెసర్వంబంచునూ * అంతటను * నిన్నుతాగాంచుచుండూ
భావంబునందునేనే * నీవంచు * భావించురాజేశ్వరా ॥ ౫౭ ॥
అష్టమదములజిక్కియూ * నీయందు * నిష్టనిల్పగలేకనూ
భ్రష్టులైచెడిపోదురూ * జగమందు * పతితులైరాజేశ్వరా ॥ ౫౮ ॥
కామాదివర్గములనూ * విడలేక * కర్మములుజేశిజనులూ
వేమారుజన్మములనూ * యెత్తుదురు * వదలకనురాజేశ్వరా ॥ ౫౯ ॥
తన్నుతాదెలియకెన్ని * సాధనలు * తరుచుగాసాధించినా
పన్నుగానిన్నువాడు * గాంచునే * పరమాత్మరాజేశ్వరా ॥ ౬౦ ॥

తన్నుతా దెలిసినపుడే * యన్నియును * తానయ్యె వెలుగుచుండు
నిన్నుతనలో తానుగా * గాంచుసుమి * నిర్మలుడు రాజేశ్వరా ॥ ౬౧ ॥

నీదయామృతదృష్టిచే * నాకిప్డు * నిర్మలాత్మజ్ఞానమూ
వేదాంతవేత్తలకును * ఇచ్చిన * వివేకంబు రాజేశ్వరా ॥ ౬౨ ॥

కరుణరానివ్వవయ్యా * నీచరణ * కమలములు గొల్తునయ్యా
దీరత్వమొసగవయ్యా * బాపునా * దీనతను రాజేశ్వరా ॥ ౬౩ ॥

పరమకరుణాసాగరుండా * నందు * డనులుడఖిలేశ్వరుడు నూ
గురుడు విశ్వమునకనుచూ * శృతులెల్ల * గణియించు రాజేశ్వరా ॥ ౬౪ ॥

సగుణుండవనుకొందరూ * నిన్నెపుడు * స్మరణచేయుచునుందురూ
అగుణుండవనికొందరూ * నిశ్చయం * బానుదురు రాజేశ్వరా ॥ ౬౫ ॥

సగుణనిర్గుణములకును * నీవెపుడు * సాక్షివైయుండిగాకను
అగణితంబుగవెలుగుచు * నీవుందు * వనయంబు రాజేశ్వరా ॥ ౬౬ ॥

పలుదెరంగులజూచినా * శృతులందు * పరమాత్మవకడవీవే
పలువిధంబులదోతువూ * యనిబుధుల్ * పరమేశ రాజేశ్వరా ॥ ౬౭ ॥

పలుదెరంగులజూచెడి * బద్ధులకు * భావింపనలవిగాదూ
చలనంబులనుబొందుచూ * నిన్నెపుడు * చేరరో రాజేశ్వరా ॥ ౬౮ ॥

కలనైనమానవుండూ * సద్గురుని * కరుణామృతంబుగ్రోలీ
యిలలోననినుగొల్చినా * వాడెసి * కీష్టుండు రాజేశ్వరా ॥ ౬౯ ॥

సత్యంబునీవంచునూ * యహర్నిశము * స్మరియించెదను నిత్యము
నిర్వాణపదవినిచ్చి * నన్నేలు * నిక్కముగ రాజేశ్వరా ॥ ౭౦ ॥

భానుకోటిప్రకాశా * విశ్వేశ * పరమకల్యాణరూపా
దీనుడననుబ్రోవనూ * నీకన్న * దిక్కేది రాజేశ్వరా ॥ ౭౧ ॥

అణువుకన్నసూక్ష్మమై * విశ్వమును * దంతటనుపరిపూర్ణమై
గుణములకతీతుండవై * వెలుగుదువు * గురుతుగా రాజేశ్వరా ॥ ౭౨ ॥

దేహిదేహంబులకును * నీవసం * దేహమేమియు లేకనూ
సాహసంబుగనెప్పుడూ * వెలుగుదువు * సాక్షివై రాజేశ్వరా ॥ ౭౩ ॥

గంగయమునావాణియూ * సంగమా * ఘనత్రివేణీమధ్యను
    పొంగుచునునీవుందువూ * నాయాత్మ * లింగమైరాజేశ్వరా ॥ ౨౪ ॥
లింగాంగభంగులకును * హృత్పద్మ * భృంగమై రాజిల్లుచూ
    శృంగారవతినిగూడి * సర్వంబు * జూచెదవురాజేశ్వరా ॥ ౨౫ ॥
కోటినోములునోచినా * యజ్ఞములు * కోట్లకొలదిగజేసినా
    పాటించిపొందలేరూ * నీపరమ * పదముశ్రీరాజేశ్వరా ॥ ౨౬ ॥
నీమాయకన్న వేరే * యొకటైన * నిక్కముగగలిగియుండునా
    కామాంధకారులెపుడు * నీమహిమ * గాంచరోరాజేశ్వరా ॥ ౨౭ ॥
పంచవింశతితత్వముల్ * గూడగా * పరగస్థూలశరీరమూ
    అంచితంబుగనాయెనూ * నదియు * భోగాలయమురాజేశ్వరా ॥ ౨౮ ॥
పదియేడుతత్వములను * గూడినది * పరమలింగశరీరము
    అదియుసుఖదుఃఖములకూ * ఆలయం * బఖిలేశరాజేశ్వరా ॥ ౨౯ ॥
యీరెండుదేహములపై * యభిమాన * మిడువకనుండుచున్నదియే
    కారణశరీరమనుచు * నెన్నుదురు * ఘనులుశ్రీరాజేశ్వరా ॥ ౩౦ ॥
మూడుదేహంబులందూ * గలిగుండు * మూడవస్థలటంచును
    వేడుకగాబలుకుచుందూ * వేదాంత * వేద్యులోరాజేశ్వరా ॥ ౩౧ ॥
దేహములునీవుగావు * దేనిపై * మోహంబునీకులేదూ
    దేహిదేహములనుచును * గురుతెరిగ * దేవుడవురాజేశ్వరా ॥ ౩౨ ॥
యరుకమరుపులరెంటిని * నెరిగేటి * యెరుకవేసివంచును
    పరమయోగీంద్రులందూ * నిన్నెపుడు * పరమాత్మరాజేశ్వరా ॥ ౩౩ ॥
యరుకమరుపులుగానిదీ * మరివాటి * నెరుగకేమియులేనిది
    పరిపూర్ణమీవటంచూ * వేత్తలు * బలుకుదురురాజేశ్వరా ॥ ౩౪ ॥
నిన్నుకలవాడటంచూ * కొందరు * నిర్ణయింపుచునెప్పుడూ
    అన్నిటికిమూలమంచూ * నినుకొంద * రరయుదురురాజేశ్వరా ॥ ౩౫ ॥
లేనివాడనికొందరూ * మరిలెక్క * లేకుండవాదింతురూ
    నీనిధానంబుదెలియూ * నెవ్వరూ * నేర్తురోరాజేశ్వరా ॥ ౩౬ ॥

వున్నదిలేనిదనుచూ * వాదించ * నుచితమాజనములకును
పన్నగాపరిపూర్ణులూ * నిటువలెను * బలుకరోరాజేశ్వరా ॥ ౮౭ ॥
సంకల్పమిడువలేకా * నిటువలెను * సంకటాపడువారలు
పొంకముగనీతత్వమూ * నెటువలెను * పొందుదురురాజేశ్వరా ॥ ౮౮ ॥
వున్నదనియెంచరాకా * లేనిదని * తిన్నగా తెలియరాకా
వున్నదేపరిపూర్ణమూ * యదినీవె * వొప్పుగారాజేశ్వరా ॥ ౮౯ ॥
యిన్ని జెప్పంగనేలా * కన్నులలో * వున్నదే తెలివిచాల
పన్నుగాయదినీవెగా * నోపర * బ్రంహ్మశ్రీరాజేశ్వరా ॥ ౯౦ ॥
నిన్ననేభేదమెంచా * జాలనో * నిటలాక్షుశంభులింగా
పన్నుగానాదుహృదయా * పద్మష * ట్పదరాజరాజేశ్వరా ॥ ౯౧ ॥
అన్నిదేశములందునా * మరియునీ * వన్నికాలములందునా
అన్నివస్తువలందునా * వుందువా * నందమునరాజేశ్వరా ॥ ౯౨ ॥
యెనుకమరుపులులేకను * నిత్యమై * యేకమైయవ్యయంబై
పరిపూర్ణముగనుందువూ * నీబట్ట * బయలయ్యరాజేశ్వరా ॥ ౯౩ ॥
బట్టబయలనుచునోటా * నెప్పుడును * బలుకుచుండెటివారలు
వట్టివేగాకున్నను * యవ్వెపుడు * ఘటియ్యనెరాజేశ్వరా ॥ ౯౪ ॥
బట్టబయలైనవారి * భావంబు * పరమేశనీకుదెలుసూ
దిట్టముగవారిదలుతు * నటువంటి * దిట్టలేరాజేశ్వరా ॥ ౯౫ ॥
అట్టివారలకెప్పుడూ * కలదులే * దనెడిసంశయములేదూ
బట్టబయలయినవారే * నీవుగా * పరిపూర్ణరాజేశ్వరా ॥ ౯౬ ॥
అందుకేనేనునీవూ * యనియెడీ * సందేహమొదలినాను
పొందుగానేనెయనుచూ * నిన్ననే * పొందితినిరాజేశ్వరా ॥ ౯౭ ॥
నీవునేనైనవెనుకా * వున్నదే * నీకునాకునుభేదమూ
భావించిచూడనోకా * బ్రంహ్మమే * పరమాత్మరాజేశ్వరా ॥ ౯౮ ॥
నాయందుదయదలచియూ * యప్పుడును * నాతోననీవుండియూ
పాయనిప్రేమచేతా * జేసితివి * పావనునిరాజేశ్వరా ॥ ౯౯ ॥

నన్ను మన్నన జేయుచూ * నాతప్పు * లన్నియునుమన్నింపుచూ
నన్ను విడకుండ నెపుడూ * నీవుందు * వనయంబు ॥ రాజేశ్వరా ॥౧౦౦॥

నాకన్ని సంశయములం * దీర్చుచును * నాకుబోధించుకొనుచూ
చేకొనిరక్షింతువు * వో చంద్ర * శేఖర ॥ రాజేశ్వరా ॥౧౦౧॥

పాపాత్ముడనివిడువకా * నన్ను చే * పట్టిరక్షించుకొనుచూ
నీపాదయుగమునాదూ * హృదయమున * నిలిపితివి ॥ రాజేశ్వరా ॥౧౦౨॥

తనకుదాబట్టబయలై * తనకున్న * యభిమానమెల్ల వదలీ
మనసు లేకుండ వెల్గే * నాతండు * మాన్యుడో ॥ రాజేశ్వరా ॥౧౦౩॥

నీదయాదృష్టి నేనూ * యెంతనుచు * నిక్కముగ వర్ణింతునూ
వో దయా సాంద్రచంద్రా * వేదాంత * వేద్యశ్రీ ॥ రాజేశ్వరా ॥౧౦౪॥

బ్రహ్మదులెల్ల నిన్నూ * గణుతింప్ప * భయమొందుచుండగానూ
యిందుమహిలో నిన్ను నేనూ * వర్ణించ * నేర్తునా ॥ రాజేశ్వరా ॥౧౦౫॥

నీనుపదేశమునను * నామనో * నీరజమువికసించియూ
మోద మొందుచుయున్నదీ * తనకుదా * మురయుచును ॥ రాజేశ్వరా ॥౧౦౬॥

వేములవాడవాసా * వేదాంత * వేద్యహృత్పద్మభృంగా
స్వామి నేనీవాడనూ * ననుబ్రోవు * సర్వజ్ఞ ॥ రాజేశ్వరా ॥౧౦౭॥

గురుపుశిష్యులభావమూ * జూపించి * గురుతుమర్మంబుదెలిపీ
పరిపూర్ణునిగనన్ను నూ * జేశితివి * పరమగురు ॥ రాజేశ్వరా ॥౧౦౮॥

మంగళమువిశ్వేశ్వరా * గౌరీశ * మంగళముసర్వేశ్వరా
మంగళము పరమేశ్వరా * హరహరా * మంగళము ॥ రాజేశ్వరా ॥౧౦౯॥

అన్నావధూతభూమా * నందుని * హృదయాంబు జమునందునా
పన్నుగానివుండియూ * వింతయూ * బల్కితివి ॥ రాజేశ్వరా ॥౧౧౦॥

నీస్తవంబెవ్వరైననూ * విడకుండ * నిక్కముగ చదువవిననూ
వాస్తవంబుగమోక్షమూ * పొందుదురు * వదలకను ॥ రాజేశ్వరా ॥౧౧౧॥

గద్య

ఇతి శ్రీమత్పరమ భూమానంద యోగీంద్ర
శ్రీమద్వేదాంతి అన్నావధూత విరచిత రాజేశ్వర శతకము సంపూర్ణం



శ్రీ సద్గురవే నమః

# హంసశతకము

శ్లో॥ నిర్గుణం నిష్కళం నిత్యం ♦ నిర్వికార నిరామయం
మాయాతీత మనాద్యంతం ♦ మల్లయార్య గురుం భజే ॥

క॥ శ్రీ కైవల్య పదంబై * ప్రాకటముగ వెలుగునట్టి * పరిపూర్ణంబే
యేకమని నిత్యమదిలో * చేకొని వందనము జేతు * సిద్ధముహంసా ॥

క॥ గురుమల్లేశ్వర వాక్యము * హరిహర వాణీశులకును * ఆనందంబై
సరిలేక వెలుగుచుండును * మరువక సేవింతు గురుని * మదిలో హంసా ॥

క॥ యతులును గణములు ప్రాసలు * మతిరహితుండైనయట్టి * మాన్యులకిలలో
హితవుగ జూడగదగునా * అతులిత వాక్యముల రభస * మందవె హంసా ॥

క॥ సందేహమేమి లేకను * అందరిలో వెల్గుచున్న * ఆత్మవు నీవే
యుందందున నెడి సంశయ * మందక నిను జూచువాడు * అమలుడు హంసా ॥

క॥ నాదాతీతం బీవని * వేదంబులు బల్కుచుండు * వేదుకలో గన
ఆది అనాదివి గావని * వాదంబులు జేయుచుండ్రు * వసుధను హంసా ॥

క॥ అంగమున లింగ దేహము * భంగముతా జేసినపుడె * బయలై సర్వం
లింగ మయంబుగ దోచును * సంగము లేకుండ వెల్గు * సత్యము హంసా ॥

క॥ గురు కరుణకు పాత్రుండై * గురుచరణము మరువకుండ * గుణరహితునిగా
మరువక దలపుచు నుండిన * పరిపూర్ణుండై వెలుంగు * పావన హంసా ॥

క॥ గురువును నరుడని దలచక * హరిహర వాణీశులనుచు * ఆత్మయటంచున్
పరిపూర్ణుడనుచు గొలచిన * సరిలేని పదంబుగల్గు * సత్యము హంసా ॥

క॥ గురు ఋణము లెట్లుదీరును * గురు సేవలు జేయలేని * గుణహీనులకున్
పరలోక మెట్లు దొరుకును * పరమాత్ముని గూడుటెట్లు * పావన హంసా ॥

కం॥ గురునకు హరునకు వేరే * పరభావం బెంచునట్టి * పాపాత్ములకున్
నరకంబు సిద్ధ మనుచును * గరకంఠుడు బల్కుచుండు * ఘనముగహంసా ॥

కం॥ గురుమూర్తి సేవజేసిన * పరిపూర్ణుం డగునతండు * పాపరహితుడై
గురుమూర్తి సేవజేయని * నరులకు యమలోకమబ్బు * నయముగహంసా ॥

కం॥ గురుమూర్తిని కోపించిన * గురుమూర్తికి యెదురుబల్కు * గుణహీనులకున్
నరకంబు సిద్ధమనుచును * గరకంఠుడు బల్కుచుండు * ఘనముగహంసా॥

కం॥ గురుమూర్తి మూర్తి జూచియు * పరమాత్మ్మం డితడన్న * భావజ్ఞులకున్
సరిలేని మోక్ష మబ్బును * మరిజన్మం బెత్తబోడు * మహిలోహంసా ॥

కం॥ సారంబగు గురుమంత్రము * పారాయణ మెప్పుడు జేయు * పావను లిలలో
సార విహీనం బగు * సంసారంబును జెందబోడు * సత్యముహంసా ॥

కం॥ మదిలోన గురునిమంత్రము * ముదమొప్పగ భజనజేయు * ముఖ్యుల కెల్లన్
కొదువేమి లేక మోక్షము * సదమలముగ నదియొగల్గు * సత్యముహంసా॥

కం॥ కుల భావము గుణ భావము * మలినాత్ములు వదల లేక * మరిగిరిసీలం
బిలలోను తానుబుట్టుట * మలమూత్రపు కులముగాదె * మహిలోహంసా॥

కం॥ మల మూత్ర కుక్షిలోపల * పలుమారును దుఃఖమంది * పాపపు జనముల్
తెలివొంద లేక నిలలో * కల కాలము బుట్టవలసె * కారణహంసా ॥

కం॥ యెంగి లమంగళ మందురు * యెంగిలి యనతగదు * జన్మ మెంగిలి గాదా
యెంగిలి యంగముగాదా * యెంగిలి దినకున్న ముక్తి * నెరుగడుహంసా ॥

కం॥ యెంగిలి యనతన జన్మము * యెంగిలి యన శబ్దజాల * మెంగిలి గాదా
యెంగిలి వేదముగాదా * యెంగిలి దినకున్న మోక్ష * మెరుగడుహంసా ॥

కం॥ యెంగిలి భావం బెరుగక * అంగము వదలంగలేరు * అజ్ఞానులిలన్
యెంగిలి భావమెరింగిన * అంగము లేకుండ * పూర్ణుడౌగదహంసా ॥ 20

కం॥ దీక్షాభావం బెరిగియు * పక్షాపక్షములు లేక * భావంబునసీ
సాక్షిత్వ మెరుగ గోరిన * కుక్షిని కైవల్యముండు * గురుతుగ హంసా ॥

కం॥ పన్నుగ హృత్కమలములో * సన్నపు రంధ్రమ్ములోన * సంపూర్ణుండై
తిన్నగ వెలిగెడి యాత్మను * కన్నులుయెటచూట్కి * చేయగలవేహంసా ॥

కం॥ బిందువ గర్భము మధ్యను * అందముగా శుద్ధధవళ * మగుచునుసోహం
పొందుగ వెలగుచు నుండును * అందుననే వెలుగుచుండు * ననయముహంసా ॥

కం॥ సోహంబీజము మధ్యను * సాహసముగ వెల్గునట్టి * సత్యజ్ఞానం
సోహంబని దెలసిన * హంసోహంబై వెల్గుచుండు * సుస్థిరహంసా ॥

క॥ హృదయమనే దర్పణమున * సదమలముగ మనసుచేత * చక్కగ జూడన్
హృదయములో పూర్ణంబను * పదమందున జిక్కుమనసు * పావన హంసా ॥

కం॥ మనసెప్పుడు లీనమగునో * మనసు వికారంబులెల్ల * మానును పిదపన్
గనబోతె వేరు లేకయి * తనుదానే వెల్గునతడు * తథ్యముహంసా॥

కం॥ ఏమాయ యీ జగంబున * నీ మాయయె కాక వేరు * నిజముగ గలదా
ఏమాయ మాయమాయా * నీ మాయే మాయమైన * నీవేహంసా॥

కం॥ కామ క్రోధాదులలో * తామునియెడి మోహబుద్ధి * తగిలినమజల్
యేమాత్రమయిన మోక్షము * సామాన్యంబుగను * బొంద జాలడుహంసా

కం॥ నలువయటంచును కొందరు * సలలితముగ విష్ణువనుచు * శంభుండనుచున్
కలనైన తన్నుగానక * బలికితె ఫలమేమిగలై * పావన హంసా ॥

కం॥ యక్కడజూచిన నీవే * మక్కువ శోడుతను నిండి * మనుజుల లోనన్
చక్కగ దృక్కుల వెలుగుచు * చిక్కలు బాపెదవు నీవు * సిద్ధము హంసా ॥

కం॥ వాదించ వచ్చు శాస్త్రము * భేదించుట కష్టముండు * బుధజనులెల్లన్
వాదము భేదంబునకే * వాదంబున కందదాత్మ * వాసిగ హంసా ॥

కం॥ కనులేకము జేసియుతా * ననుమానము లేకజూచి * నాంతర్యమునన్.
వినరాని దానివినుచును * గనజాలని దానిగాంచి * ఘనుడగుహంసా ॥

కం॥ తనుదా నెరుగుట కొరకై * తనుదా వాదించవలయు * తత్వజ్ఞులిలన్
తనుదా వాదము జేసిన * అనుమానము లేకపూర్ణ * జాగద హంసా॥

కం॥ జీవునకు యీశ్వరునకును * భావింపగ వేరులేదు * పరి పూర్ణమునన్
జీవునటు గలసి చూచిన * భావమునందాత్మవకటె * భవహార హంసా ॥

కం॥ జీవుడు యీశుడు వేరని * కావరమున బల్కగలరు * ఘనుల మటంచున్
యేవిధమునైన జీవుని * భావంబెరిగున్న నిట్లు * బలుకునె హంసా ॥

కం॥ సందేహ మేమి లేకను * అందముగా తనరుదాన * ఆత్మ యటంచున్
పొందుగ భజియించినవా * డందముగా ముక్తిఁబొందు * నయముగ హంసా
కం॥ క్షరమునకు సాక్షియైతా * క్షరమే నేననుచు మోహ * చరలోఁజిక్కన్
క్షరమునెరింగెడి యక్షర * పురుషుడనే ననెడివాడు * పూజ్యుడు హంసా
కం॥ సకలంబు దానె దెలియుచు * సకలంబు నెరుంగునట్టి * సాక్షియుదానై
యకళంకమనుచు నెరిగిన * వికలం బేమియును లేని * విమలుడు హంసా
కం॥ మోహంబు చేత జీవుడు * దేహంబే ననుచుతన్ను * దెలియక నుండున్
దేహంబే నని యెంచుమది * మోహంబును వదలినపుడె * ముక్తుడు హంసా
కం॥ వెన్నయు చేతుల నుండుక * పన్నుగ నేయి జేసినట్లు * పరతత్వజ్ఞుల్
తిన్నగ తముదా మెరిగియు * అన్నిట వెలిగేటి వెల్గు * నందిరి హంసా

౯౦

కం॥ జ్ఞానం బనియెడి ఖడ్గము * పూనికర స్థలమునందు * పురుషుండీల
నజ్ఞానమను యడవి నరికిన * వాని సమానుండు లేడు * వసుధను హంసా
కం॥ అజ్ఞానం బనుచీకటి * విజ్ఞానం బనెడిజ్యోతి * విమలపు కాంతిన్
అజ్ఞానాంధము బాసియు * సుజ్ఞానము చేతతన్ను * జూచును హంసా
కం॥ యే వెల్గు చేత సర్వము * భావంబున దోచుచుండు * పాటింపంగా
యే వేళ వెల్గుచుండెడి * యా వెల్గును గన్నవాడు * అమలుడు హంసా
కం॥ పరిపూర్ణ బోధ దెలియక * నరులెల్లను భేదవాద * నటనల చేతన్
మురయుచు దిరుగుచు కడకున్ * మరిమరి జన్మంబు లెత్తి * మరిగిరి హంసా
కం॥ యిదిఘట మిదిపట మిదిమఠ * మిది సర్వం బనుచు మెరుగు * విమలాత్మను దా
ముద మొప్ప నెరుగు నాతడు * సదమలముగ ముక్తుడగును * సత్యము హంసా
కం॥ చిన్మయ మెరిగెడి వారలు * మన్మయముల వదలి వేగ * మదిలో గురునిన్
చిన్మయుడని సేవించిన * జన్మంబుల నెత్తబోడు * జయగురు హంసా
కం॥ మది లేనిగురుని శిష్యుడు * మది లేకను గొలిచితాను * మదితో సర్వం
వదిలినవాడే సద్గురు * డిది దెలిశిన వాడె పూర్ణు * డిలలో హంసా
కం॥ యిదందనకను పూర్ణం * బొదుగనజూచినను వెల్గు * నంచము లోదన్
సందేహము గలవాడిల * ముందుంగా గాంచలేడు * మలినుడు హంసా

కII కలగాంచి మేలుకొన్నను * కలలోని విచిత్రమెల్ల * గనపడ నటులన్
తెలివొంది తన్ను గన్నను * కలవలె జగమేమిలేదు * కారణ హంసా

కII మొదలు కొనలేక నంతట * సదమలముగ వెలుగుచుండు * సత్యజ్ఞానం
బిదిదెలిసి మదిని విడచిన * ముదమొప్పగవాడునిత్య * ముక్తుడు హంసా

కII సకలము చిన్మయ మనుచును * నకళంకస్థితినిజూచు * నాతడవిద్యా
ప్రకట గుణంబుల బొందక * అకళంకము క్లేశముక్తు * డౌగద హంసా

కII వేయేల జెప్పవలయును * మాయామయమైనదాని * మర్మము గనకన్
హేయపు సంసారంబును * బాయగ లేరిలను జనులు * భవహర హంసా

కII మనుజులు సేవనిసర్వము * కనజాలక జేయువారు * కర్మముపాలై
ననయంబు పాపరాసిలో * మునుగుచునుండెదరుసుమ్మి * మూర్ఖులు హంసా

కII బలువైన మోహవార్ధిలో * గలశిన యట్లుండు నాత్మ * గనుగొనకున్నన్
తలపుడిగి తన్నుగన్నను * కలగని మేల్కొన్న యట్లు * గనబడు హంసా

కII సత్యజ్ఞానానంద * ప్రత్యగ భిన్నాద్వితీయ * పరిపూర్ణంబున్
సత్యముగదా నెరింగిన * నిత్యం బపరోక్షమందు * నిలచును హంసా

కII కలలోపలి గాయంబులు * కలతీరనవెనక తనకు * గానంబడునా
యిలసంసారము లిట్టివి * మలినాత్ములు వదలలేరు * మరిమరి హంసా

కII యేకములోన ననేకము * ప్రాకటముగ గానుపించు * భావములోనన్
యేకమను తెలివిగల్గిన * ననేకంబులు లేవుదనకు * నయముగ హంసా

కII లేకజనించిన జగమును * ప్రాకటముగనున్న దనుచు * బల్కెటిమాయన్
లేకుండ తానుజూచిన * యేకంబై గానుపించు * యొందున హంసా

కII మతములు లనంగను కల్లలు * సతతము తన్నెరుగునట్టి * సర్వజ్ఞునకున్
హితవు నెరుంగక జనులు * మతిహీనపు మతములెల్ల * మరిగిరి హంసా

కII మరుపనిమొడి ఆవరణము * గురుకరుణను వదలిపోవ * గుణములులేకన్
హరిహరుల కాశ్రయంబగు * పరతత్వంబై వెలుంగు * పావన హంసా

కII తలచెడి తలపునెరింగియు * కలమెరుకల నెరిగితన్ను * గనుగొని జూడన్
కలియుగ చిత్ర విచిత్రము * కలవలెనే గానిపించు * ఘనముగ హంసా

కం॥ ఆకాశ మాత్మయనుచును * ప్రాకటముగ శృతులు బల్కు * పద్ధతిజూడన్
ఆకాశ మాత్మగాక * పరాకాశం బ్రహ్మమగును * ననయము హంసా

కం॥ సత్యజ్ఞాన మనంతము * నిత్యము పరిపూర్ణ శుద్ధ * నిర్గుణ తత్వం
సత్యముగదా నెరింగిన * నిత్యుండై దా వెలుంగు * నిజముగ హంసా

కం॥ ఆకాశమువలె నిండియు * ప్రాకటముగ వెలుగుచున్న * పరతత్వంబున్
చేకొని దనలోగన్నను * ప్రాకటముగ దానెయగును * పావనహంసా

కం॥ సత్యంబై నిత్యంబై * సత్యాసత్యంబులకును * సాక్షియుదానై
నిత్యముగుదన్ను గన్నను * సత్యంబుగ ముక్తుడగును * సద్గురు హంసా

కం॥ బ్రహ్మం బనంగవేరా * బ్రహ్మంబని యనగతాన * బయలై యుండన్
బ్రహ్మైవాహం బనుచును * బ్రహ్మవిదుడు దలుపుచుండు * పావన హంసా

కం॥ బ్రహ్మంబునైతి ననుచును * బ్రహ్మంబే ననుచు విగత * పాపుండగుచున్
బ్రహ్మధ్యానము జేయుచు * బ్రహ్మంబై దా వెలుంగు * భవహర హంసా

కం॥ యొగగడి యెరుక నెరింగెడి * యెరుకను నేననుచు నెరిగి * యేకంబై తా
నెరుగని యటువలె నెరుగును * యెరుకునితో లేరుసములు * యెందునుహంస

కం॥ తనకన్న శివుడు వేరని * తనుదెలియనివాడు బల్కు * ధరలో నిత్యం
తనుగన్న యట్టి పురుషుడు * తనువెవ్వడు లేకవెల్గు * తథ్యము హంసా

కం॥ కర్తృత్వ మెల్ల జేసియు * కర్తను నేననుచు జడుడు * కర్మముపాలౌ ౭౦
కర్తృత్వ మెల్లహరిదని * కర్తృత్వము జేసివా * డకర్తగు హంసా

కం॥ పొందక పొందినవాడే * సందేహము లెల్లవిడచి * సత్యజ్ఞానా
నందుండై తా వెలుగుచు * అందరివలె నతడుదిరుగు * ననయము హంసా

కం॥ బురదలో దిరిగెడికుమ్మరి * పురుగువలెన్ దిరుగు చుండు * భువిలోసాధుల్
ధరలోవారల భావము * నరపశువుల కేమి యెరుక * నయముగ హంసా

కం॥ వ్రతముల్ క్రతువుల దేలా * సతతము తీర్థముల యాత్ర * సలుపగనేలా
హితవైనయట్టి అద్వయ * మతమందున నిల్చువాడు * మాన్యుడు హంసా

కం॥ యెందుకుయీ జపతపములు * యెందుకు యీకర్మజాల * మెల్ల సలిపితా
మందరివలె భువిలోపల * బంధనముల జిక్కగలరు * పావన హంసా

క॥ అద్వైతమనఁగ యాత్మగు * అద్వైతంబనఁగ పూర్ణ * మగుసత్యముగా
అద్వైత మార్గ మెరిగిన * అద్వయుఁడై నతఁడు వెల్గు * నమలుఁడు హంసా

క॥ భ్రమమూల మీజగంబును * భ్రమతోడుత కర్మములను * బహుజేశినయా
భ్రమదీరకుండు నెప్పుడు * భ్రమదీరిన వాడె పూర్ణ * భావుఁడు హంసా

క॥ తనువాంఛ లెల్ల వదలియు * తనవాంఛను జెందువాఁడు * తత్వజ్ఞుండౌ
తనువాంఛ వదలకున్నను * తనువుల నేకంబుగల్గు * తథ్యము హంసా

క॥ దేహాభిమానములపై * మోహంబును వదలి మోక్ష * మార్గ మెరిగినన్
దేహంబు లెత్త బోడిక * సాహసమున ముక్తుడగును * సత్యము హంసా

క॥ సతతంబాత్మ సమాధిని * మతిరహితుం డయ్యుబొందు * మాన్యుండిలలో
హితమైన పూర్ణతత్వము * సతతముదానై వెలుంగు * సత్యముహంసా

క॥ అహం భావంబు నకును * దేహమువాచ్యార్ధ మనుచు * తెలిసినమీదన్
అహంభావంబును * హంసోహంబై నిలచియుండు * సుమ్మికహంసా

క॥ అపేక్ష లేకకర్మము * ఓపికతో జేసిశివుని * కొప్పించినతా
నేపాపపుణ్యమెరుగక * యాపరమేశ్వరుని బొందు * నమలుఁడు హంసా

క॥ దేహంబాత్మ యటంచును * మోహంబున మునిగినారు * మూర్ఖపుజనముల్
దేహంబు ఆత్మగాదని * మోహంబును వదలువాడె * ముక్తుఁడు హంసా

క॥ నిత్యమవస్థాత్రయముల * సత్యంబుగ గాంచునట్టి * సత్యజ్ఞానం
బత్యంత విమలముగగన * నిత్యం బపరోక్ష మగును * నిజముగ హంసా

క॥ మనమును విడచిన సుజనుడు * తనువనియెడి మోహబుద్ధిం * తగలకయుండున్
మనుసును విడువని మనుజుడు * తనుధనముల జిక్కియుండు * ధరలో హంసా

క॥ సర్వం బ్రంహ్మంబనుచును * సర్వజ్ఞుడు గాంచునిత్య * సమ్మతితోడన్
సర్వంబ్రంహ్మంబని తుద * నిర్వాణ పదంబు బొందు * నిజముగ హంసా

క॥ నీవనియెడి నేననియెడి * భావంబుల నెల్ల వదలి * పరతత్వంబున్
భావింపుమండి పూర్ణం * బై వెల్గిరిగాదె పూర్ణు * లనయము హంసా

క॥ పరమానంద పరాత్పర * పరిపూర్ణం బెందుజూడ * బయలై యుండున్
నరులిది గానగ లేకను * మరిమరి జన్మంబులెత్త * మరిగిరి హంసా

కం॥ సగుణము నిర్గుణమనుచును * నగణితముగ యణువటండు * నటువిభువనుచున్
దగపరమాణు వటంచును * నిగమంబులు జదివియుండ్రు * నజముగ హంసా

కం॥ కొందరు తనువంచును మరి * కొందరు మనమంచునింక * కొందరు భావం
బందురుతను మనములకును * పొందుగతా సాక్షియనుచు * పోల్చిరి హంసా

కం॥ సత్తనుచును మఱికొందరు * చిత్తనుచును బల్కగలరు * చిన్మయమనుచున్
అత్తరియానందంబని * చిత్తంబునదెలియగలరు * సిద్ధము హంసా

కం॥ కోశంబు లాత్మయనుచును * కోశంబులుగావటంచు * కొందరుఆత్మన్
కోశాతీతమటందురు * వాసిగనిజమెఱుగనెవరి * వశమగు హంసా

కం॥ నాదంబటంచు కొందరు * మోదంబున బిందువనుచు * ముదమున వినియున్
కాదనుచు కళయటంచును * వాదంబులు చేయుచుండ్రు * వసుధను హంసా

కం॥ దృక్కనుచును దృశ్యంబని * దృక్కను దృశ్యంబుగాద * దృశ్యంబనుచున్
మక్కువతో బలికెదరిటు * చక్కగతమ్మెఱుగలేరు * సత్యముహంసా

కం॥ ఇదియదియని యనరాకను * పదిలంబుగ వెల్గునట్టి * పరతత్వంబున్
ముదమున నిష్కళమనిగన * యదితానై వెల్గుచుండు * ననయము హంసా

కం॥ లక్ష్యాలక్ష్యము లేకను * పక్షాపక్షములుగాక * పరిపూర్ణంబై
సాక్షియగు దానినెరిగిన * తక్షణమున దానెయగును * తథ్యము హంసా

కం॥ భక్తిజ్ఞానవిరక్తులు * ముక్తికిమూలంబటంచు * ముఖ్యులుబలుకన్
భక్తిగురువందునుంచిన * ముక్తుండై దావెలుంగు * మురయుచు హంసా

కం॥ పరమాద్వైత విచారము * తరవాగనుగొనుట కెల్ల * తాటోటులకున్
గురుమూర్తి సేవజేసిన * పరిపూర్ణుల కెరుకగాక * పావన హంసా

కం॥ మాయగదా జగమెల్లను * పాయగదా గురునికరుణ * బడిసిన యపుడే
ఆయగదా పరిపూర్ణము * మ్రోయుగదా వేదమిట్లు * మురయుచు హంసా

కం॥ కనులనుగానగరాకను * మనమునవివరింపరాక * మాయాతీతం
బనయంబు వెల్గుపూర్ణము * కనులను నెటువలెనుగాంచ * గలరే హంసా

కం॥ సాధనజేసెడివారలు * మోదముతో సాధనములె * ముఖ్యంబనుచున్
యేదరి జేరకనుండెడి * సాధకులకుజిక్క దాత్మ * సత్యము హంసా

క॥ జీవేశ్వరులునుగాకను * కేవలముగ వెల్గుదాని * కీలుదెలిసినన్
భావాభావవివర్జిత * భావజ్ఞుండై వెలుంగు * పావన హంసా

క॥ ఇతరము నెప్పు డెరుంగక * ఇతరముతా నెపుడుగాక * ఇతరమువినకన్
మతిలేక మాయగాకను * సతతము పూర్ణంబువెల్గు * సత్యముహంసా

క॥ అంతర్బాహ్యంబులతా * సంతతము వెలుంగునాత్మ * సత్యంబనివే
దాంతులు బల్కుచునుందురు * అంతర్బాహ్యములుగాని * ఆత్మను హంసా

క॥ అంతర్బాహ్యములనియెడి * సంతతసంశయమువదలి * సహజస్థితిగా
మంతనము లేకనుండిన * అంతటతానై వెలుంగు * నదయము హంసా

క॥ గురు తెరిగెద ననిదలచిన * గురుతొక్కటె యనుచుశ్రుతులు * గుణియించంగా
గురు తెరుగుటకును వేరె * గురు తెక్కడ వేరుదెత్తు * గురుతుగహంసా

క॥ అదియదె ఇదియిదె యనుచును * ముదమొప్పగ బల్కగలరు * మూర్ఖపు
జనముల్ ఇదియదియ జేసినవారే * యదితానై వెల్గుచుండు * నదయము హంసా

క॥ సాకారనిరాకారము * గాకుండ వెల్గునట్టి * ఘనపరిపూర్ణం
బేకమనిదా నెరింగిన * ప్రాకటముగదా నెయగును * పావనహంసా

క॥ ఆవరణంబును బాసి * నిరావరణంబై నగురుని * ననయముగసతా
భావనగురువందించిన * ఆవరణము బాసిపూర్ణు * డగునే హంసా

క॥ అజ్ఞానజలమునుండియు * విజ్ఞానంబ నెడిపాలు * విమలాత్ముండై
సుజ్ఞానము చేదీసిన * అజ్ఞానము వదలిపరము * హంసగుహంసా

క॥ వెన్నెలవలె పూర్ణుండై * అన్నయయను పరమహంస * ఆనందమునన్
తిన్నగ సద్గురుమూర్తికి * పన్నుగ నీకృతియునిచ్చె * పావనహంసా

క॥ ఈ హంసశతకమెవ్వరు * సాహాసమున చదువునట్టి * సర్వజ్ఞులకున్
మోహమును పాశమిడి * నిర్మోహుండై దానెవెల్గు * మురయుచు హంసా

గద్య

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమల్లేశ్వర గురువర్య
పాదపద్మ భృంగోపమ అన్నయ పరమహంస విరచిత
హంసశతకము సంపూర్ణము.



శ్రీ గురుభ్యో నమః

# గురువాక్యతారావళి

శ్లో॥ పూర్ణబోధస్వరూపాయ । పుణ్యపాపవివర్జితః
నిర్గుణాయ సదాశ్రీమ । ద్వేంకటేశ గురుంభజే ॥

సీ॥ శ్రీకరంబై వెల్గు శివరూపమదియగు । యద్వైతరూపమధ్యాత్మతత్వ
మాదినిర్గుణపూర్ణ మానందమమలంబు । సచ్చిదానందంబు సర్వసాక్షి
యగుపరమాత్మునియందు నవ్యక్తమై । త్రిగుణాత్మతత్వమై దివ్యముగను
ఆత్మశక్త్యేకటుండు నాయాత్మశక్తిలో । నలపరబ్రహ్మమానందముగను
గలయనీశ్వరుడని పేరుగలిగెనితడె । సగుణరూపుడటంచును సత్యముగను
నిఖిలవేదాంత శాస్త్రముల్ నిశ్చయించు । ననుచు వేంకటగురువరుండానతిచ్చె॥ ౧

సీ॥ పరమేశ్వరుఃడతానె పంచభూతాత్మక । పురములునిర్మించి పురములోన
దాప్రవేశించియు తనకుదాజీవుడై । భేదభావంబున పెంపునొందె
యీమర్మమెరుగక యిలనసాధములెల్ల । శివజీవభేదంబు సిద్ధముగను
గల్పించిజెగములో గలనైనసంసార । సాగరంబునుదాట జాలరైరి
వీరిమోహాంధకార నివృత్తికొరకు । మూలమపరోక్ష జ్ఞానమేముఖ్యమనుచు
నిఖిలవేదాంత శాస్త్రముల్ నిశ్చయించు । ననుచు వేంకటగురువరుండానతిచ్చె॥ ౨

సీ॥ మనసు లేమిగజేసి మరిసర్వశూన్యమై । యాద్యంతరహితమై యచలమగుచు
నిగమాంత వేద్యమై నిశ్చలతత్వమై । పరమప్రకాశమైభావమునకు
అరయంగరానట్టి యలపరబ్రహ్మంబు । తానని దెలిసియుతలపులోన
నితరచింతలుమాని యెప్పుడువాత్మైక్య । భావమందుననిలచి పరమనిష్ఠ
గలిగివర్తించుచుండెడి ఘనులకెపుడు । బంధమోక్షముగలదనిపలుకదగదు
నిటులవేదాంత వేద్యులు నెరుగుచుందు । రనుచు వేంకటగురువరుండానతిచ్చె॥ 3

సీ॥ ఏమిలేని జగము లేమి లేదనిచూచు । వారుతత్వజ్ఞులీవసుధలోన
సర్వశూన్యంబని సత్యంబుగా నెంచు । వారుతత్వజ్ఞులీవసుధలోన
అంతటపరిపూర్ణ మానందమునగాంచు । వారుతత్వజ్ఞులీ వసుధలోన
తనకన్న వేరేమి తలపకుండనియట్టి । వారుతత్వజ్ఞులీవసుధలోన
సగుణ మెప్పుడు తాగాక సత్యమైన । నిర్గుణబ్రహ్మమేనని నిశ్చయించు
వారుతత్వజ్ఞులంచును వాసిగాను । దెలిపి చెప్పెను వేంకట దేశికుండు॥ ౪

సీ॥ దేహంబనిత్యంబు దేహినిత్యంబని । దేహేంద్రియాదుల తీవ్రగతిని
మోహంబులెల్లను మొదటికివర్జించి । యాత్మపరమాత్మలైక్యమెరిగి
చిత్తశాంతినిబొంది చిన్మాత్రమునువినా । యితరంబుజూడక నెప్పటికిని
సర్వమాత్మయటంచు సత్యంబుగాజూచు । వారెతత్వజ్ఞులీ వసుధలోన
అట్టివారలమర్మంబు నరయుటకును । హరిహరబ్రహ్మలకునైన నలవిగాద
టంచుశాస్త్రంబులెల్ల నిట్లనునటంచు । దెలిపిచెప్పెను వేంకటదేశికుండు॥ ౫

సీ॥ గురుని చెంతకు జేరి కుటిలంబులనుమాని । పటుతరంబుగ వారి పాదయుగము
మదిలోనగొలచుచుమమతలెల్లనువీడి । యాచార్యుడేదైవమనుచు దెలిసి
సకల వేదంబులసారమైవిలసిల్లు । సద్గురువాక్యమే సత్యమనుచు
నితరదైవంబుల నితరమంత్రంబుల । విడచితత్వజ్ఞుడై విమలముగను
హరిహరబ్రహ్మలకు మూలమాదియైన । పరమగురుమూర్తి నామంబుభజనజేసి
కొనుచు దనలోననుండెడిగోర్కెలిడుపు । డనుచు వేంకట గురువరుం డానతిచ్చె ౬

సీ॥ సాధనచత్వారి సంపన్నతయులేని । వాడుముక్తినిబొందు వాడుగాడు
గురుదైవభేదంబు గణియించుచుండెడి । వాడుముక్తినిబొందు వాడుగాడు
శివజీవభేదంబు సిద్ధంబుగాజేయు । వాడుముక్తినిబొందు వాడుగాడు
తనకుదాపూర్ణమై తన్నుదామరచిన । వాడుముక్తినిబొందు వాడుగాడు
మనసులోగల్మషంబులుమాన్పలేని । వాడుముక్తినిబొందెడు వాడుగాడ
టంచు శాస్త్రంబులెల్ల నిట్లనునటంచు । తెలిపిచెప్పెను వేంకటదేశికుండు॥ ౭

సీ॥ గురుబోధదెప్ప నికుటిలశాస్త్రంబుల । పఠియింపగానేమి ఫలముగలుగు।
నాత్మైక్యమెరుగక యఖిలయోగంబుల । సాధింపఫలమేమి సత్యముగను।

తన్మయతత్త్వంబు తా నెరుంగనివాని । సేవజేసిననేమి సిద్ధిగలుగు
దనుచేతెరుంగక తరుచుచదువులు పెక్కు । చదివిన ఫలమేమి సత్యముగను
ననుచుసద్గురుబోధ తానెరిగినిత్య । మరువకున్నట్టివారలీ మాయజగము
నంటకుండుదురనుచును నయముగాను । తెలిపి చెప్పెను వేంకటదేసికుండు॥ ౮

సీ॥ గురుడెదైవంబని గురునాజ్ఞమీరక । క్రయావిక్రయార్హుడై క్రమముగాను
సర్వాభిమానముల్ సద్గురువందుంచి । నిర్జరతత్త్వంబు నిష్ఠగలిగి
యితరచింతలుమాని యెప్పుడుసద్గురు । పాదపద్మంబులభక్తిచేత
బట్టువీడకనుండు పతితపావనులకు । సర్వంబుసులభమై సత్యముగను
శీఘ్రకాలంబులో నాత్మసిద్ధిగలిగి । ముక్తికాంతయుదనకు దాముఖ్యముగను
వలచియుండు నటంచును వాసిగాను । తెలిపిచెప్పెను వేంకట దేశికుండు॥ ౯

సీ॥ మంత్రతంత్రంబులు మాయవిద్యలటంచు । నిఖిలమంత్రంబుల నాత్మరోసి
సాధనచత్వారి సంపన్నతయుగల్గి । కారణగురుమూర్తి కడకుజేరి
ఆత్మాంగస్థాన మనబడుసద్భావ । శిశూషలునునాల్గు జేసుకొనుచు
క్రయావిక్రయార్హుడై క్రమముగాదేశికు । నాజ్ఞమీరకనుండు నమలమతిని
హస్తమస్తక సంయోగమందు గురుడు । జ్ఞానమనునుపనయనంబు గలుగజేయ
శీఘ్రకాలంబులో నాత్మసిద్ధుడగును । టంచు వేంకట గురువరుండానతిచ్చె॥ ౧౦

సీ॥ మాయదాటెడిదొక్క మర్మంబుగలదది । తెలియజెప్పెదమీకు తేటగాను
జనులారమీరలు చాంచల్యమునుమాని । నామాటవింటిరా నయముగాను
విన్నమాత్రములోనె విమలాత్ములైమీరు । పాపపుంజంబులు భస్మముగను
జేసియీజగములో జన్మింపగాబోరు । నశరీరతత్త్వంబు నందగలరు
గానసిగ్గొప్పమెరిగింతు ఘట్టిగాను । బ్రహ్మమేనను జ్ఞానంబు భావమందు
మరువకుండినవారికి మాయలేద । టంచు వేంకట గురువరుండానతిచ్చె॥ ౧౧

సీ॥ ఎట్టిదుష్టుండైన యాబ్రహ్మజ్ఞానంబు । గలవాడుమోక్షాధి కారియనుచు
నిఖిలశాస్త్రంబుల నిశ్చయంబు లెరింగి । వారిసేవించెడి వారెఘనులు
అజ్ఞానములజిక్కి యాత్మజ్ఞులనుదూరు । వారెట్టిపుణ్యముల్ వాసిగాను
జేసినవిఫలమై చెడిపోవుచుండును । గాని వృద్ధినిబొంద గాన లేరు

గానఆత్మజ్ఞులను తాముగాంచినపుడె । వందనంబులు జేసినవారలకును
సంతతముపుణ్య ఫలమబ్బు సత్యమనుచు । దెలిశిచెప్పెను వేంకటదేశికుండు॥ ౧౨

సీ॥ ఆత్మపరమాత్మలకైక్యంబు జెప్పిన । నాశ్చర్యమొందెద రజ్ఞులిలను
ఆత్మకించజ్ఞుండు నలపరమాత్ముండు । సర్వజ్ఞుడై యుండు సత్యముగను
నిటువంటివారికి నెటువలెనైక్యంబు । ఘటియించునని మదిగల్మషంబు
బాయంగలేకయు బ్రహ్మవిచారుల । గనిసంతసింపని కర్ములకును
తుదకునేగతిగల్గునో తెలియదనుచు । నామమతిచింతనొందును ననుదినంబు
గానమూర్ఖుల సాధులుగలయుగూడ । దనుచు వేంకటగురువరుం డానతిచ్చె॥ ౧౩

సీ॥ సర్వేశ్వరుడుతాను సకలంబుగల్పించి । సకలంబునకుతాను సాక్షియగుచు
చిన్మాత్రరూపుడై సిద్ధమై బుద్ధమై । పరిపూర్ణతత్వమై భావమునకు
నరయంగరాకుండ నానందమొందుచు । నిగమాంతవేద్యుడై నిర్మలముగ
అఖిలభూతంబుల యంతరంగమునందు । జీవరూపంబున జెలగుచుండు
గానజీవుండు దేవుండుఘట్టిగాను । జీవదేవుల భేదంబు జేయరాదు
జేయువారికికైవల్య సిద్ధిలేద । టంచు వేంకటగురుంవరుం డానతిచ్చె ౧౪

సీ॥ వినరోజనులార యీవెర్రిచేష్టలు । మానుమటన్నను మానలేరు
దేహేంద్రియాదులు దిటముగామదిలోన । నిత్యమెంచునునమ్మి నిక్కనిక్క
కామ్యకర్మంబుల గట్టిగాజేయుచు । బహులనుహింసించి పాపులయ్యి
చలనంబులుడుగక చెప్పినవినకను । స్వాతంత్ర్యమునుగల్గి చక్కగాను
మూర్ఖులీరీతి మాయలోమునిగిమునిగి । తుదకునేమైపోదురో తెలియదాయె
ననుచునామదిచింతించు ననుదినంబ । టంచు వేంకటగురువరుం డానతిచ్చె। ౧౫

సీ॥ గురువందుభక్తియే కుటిలంబులేకుంచి । యాత్మసుజ్ఞాన మందమలుడయ్యి
వైరాగ్యమనియెడి యోడపైతానెక్కి । సంసారమనియెడి సాగరంబు
దాటినవారలు దైవానురూపులై । పరమవిదేహులై పరమతత్వ
మనియెడికైవల్య మందునపూర్ణులై । వెలుగుచునుందురు వేడ్కతోడ
అట్టివారలుమరలయీయవనియందు । పుట్టబోరని పెద్దలుపుడమిలోన
చాటిచెప్పినవాక్యముల్ సత్యమనుచు । తెలిపిచెప్పెను వేంకటదేశికుండు॥ ౧౬

సీ॥ సంసారజలధిలో సత్యంబుగామోహ । మనియెడిమకరిచే మరియుజిక్కి-
జీవుడన్గజరాజు చెప్పిచూపగరాని । కష్టంబుబొందగ కమలనాభు
డనుదేశికుడువచ్చియాత్మైక్యమనియెడి । చక్రంబుచేనక్ర శిరముద్రుంచ
జీవుడన్గజరాజు చెరమాన్పినంతట । సంసారమనియెడి సాగరంబు
దాటినిర్మలుడైయాత్మ దగ్ధపాప । పుణ్యుడై సచ్చిదానంద పూర్ణతత్వ
మనెడిపరమాత్మ జెందునీయాత్మయనుచు । తెలిపిచెప్పెను వేంకటదేశికుండు॥ ౧౭

సీ॥ బదరికాశ్రమమునబరమాత్ముడగుహరి : సగుణరూపంబునసత్యముగను
తానెదేశికుడయ్యె తనకుతాశిష్యుడై । తనకుతాబోధించుతత్త్వమార్గ
మెరిగియునడచిన మేలొందుననికదా । సకలశాస్త్రంబులసమ్మతంబు
నీగోప్యమెరిగియు యితరమార్గంబుల । చేరకయున్ననిశ్చలుడతండు
దీనిమర్మంబు దెలియకతిక్కబట్టి । యితరమార్గంబుమదినమ్మియిలనుజనులు
దిరుగనేర్చినమోక్షంబు తెరవుగనర । టంచువేంకటగురువరుండానతిచ్చె॥ ౧౮

సీ॥ హరిపరమాత్ముండు నాదియందునతానె । హంసస్వరూపుడై యమలుడైన
సనకాదిమునులకు సత్యమైనటునంటి । మార్గంబునిదియ నామాటనిజము
నీమార్గమెరిగియు నితరమార్గంబుల । నమ్మకనామాటనమ్మువారు
వారెనాశిష్యులు వారినినామాయ । జేరకుండునటంచు జెప్పినట్టి
మాధవునిసత్యవాక్యము మదినినమ్మి । నడువనేర్చినవారికి నయముగాను
పరమకైవల్యమార్గంబు పట్టుబడున । టంచువేంకటగురువరుండానతిచ్చె॥ ౧౯

సీ॥ సంసారమనుపుట్ట సర్పంబుమోహంబు । నింద్రియంబులుకోరవిషమువిషయ
బంధమేజీవుని పట్టిమోహంబనే । సర్పంబుగరచిన సత్యముగను
విషయంబులనియెడి విషముతైతలకెక్కి । అంధకారంబులో నధికమూర్ఛ
జెందియనేక మహాజన్మాదులెచ్చుచు । పలువరింపుచు నున్నపాటెరింగి
బ్రహ్మవేత్తనుమంత్రజ్ఞపరమకృపను । బ్రహ్మమేననుమంత్రాన పాముువిషము
దించినప్పుడె జీవుండు దేవుడగున । టంచువేంకటగురువరుండానతిచ్చె॥ ౨౦

సీ॥ శ్రీరామచంద్రుండు సీతామహాదేవి । సభలోనగూర్చుండి సత్యముగను
తనకుసద్భక్తుడౌ తరుచరేశ్వరుడైన । వాయునందనుజేర వాసిగాను

రామునితత్వంబు రామామణియుదెల్పె । తరువాతరాముండు తథ్యముగను
హనుమంత పరమభూమానందుడవునీవె । నీవెనేననుచునునిశ్చయంబు
జేసిజూపినయట్టి జయరామవాక్యంబు । మదిలోనదలపోసి మాయవిడచి
కల్లమార్గంబులెల్లను కడకుద్రోలి । యుండుడిందుకుమీరలట్లుండకున్న
అఖిలయోనులజన్మింతురనవరతము । టంచువేంకట గురువరుండానతిచ్చె॥ ౨౧

సీ॥ హరిభగవంతుండు నర్జుననకుమున్ను । సారథియైయుద్ధ సమయమందు
అష్టాదశాధ్యాయ మగుభగవద్గీత । యందుదెల్పినబోధ నెరిగియితర
బోధలమార్గంబు బోబోకయెప్పుడు । హరివాక్యమేసత్య మనుచునమ్మి
యఖిలకాలంబులం దాత్మైక్యభావంబు । గలిగియుండిన వారుకర్మములను
జెందకుండుదు రనుచును చెప్పినట్టి । వ్యాసవాక్యంబు నెప్పుడు వదలకుండు
ననుచుశాస్త్రంబు లెల్లనిట్లనునటంచు । తెలిపిచెప్పెను వేంకటదేశికుండు॥ ౨౨

సీ॥ దక్షిణామూర్తియు దయచేతసనకస । నందనాదుల కానందముగను
నాత్మసంకల్పంబు నణచివేయుటకునై । చిన్ముద్రధరియించి సిద్ధముగను
మునివృత్తినుండిన మునులదిగను గాని । తాముసంకల్పముల్ దగ్ధముగను
జేసినిర్మలులయ్యె జెప్పిజూపగరాని । యపరోక్షసుజ్ఞానమందితాము
మనసులీనంబుగా జేసి మాయలేక । నెటులనుండెదరదిమీర లెరిగియితర
మార్గములనెల్ల విడుచుటమంచిదనుచు । తెలిపిచెప్పెను వేంకటదేశికుండు॥

సీ॥ గోరక్షకునకును గామరౌప్పగానుద । త్రాత్రేయు లడవిలోతరుచుగాను
పాటించిదెలిపిన పరిపూర్ణతత్వంబు । నాంతర్యమందున నమలమతులు
నిశ్చయంబును జేశినిర్మలులైజీవ । పరమేశ్వరైక్యంబు పరగబొంది
పరమవిదేహులై బరగుచుండుటకును । కొదవేమి లేదనికొల్లగాను
సకలశాస్త్రంబులెల్లను సత్యముగను । దెలియజెప్పెడి మర్మంబు తేటగాను
మదినినిశ్చయముగ జేయుమనుచుమిగుల । తెలియజెప్పెను వేంకటదేశికుండు॥ ౨౪

సీ॥ జనకుండుశుకునకు జెప్పినపరిపూర్ణ । భావంబునెరిగియు బ్రతుకుగనుడి
పాండవార్జునకు పరగభీష్ముడుముక్తి । మార్గంబు దెల్పినమహిమగనుడి
పార్వతికోశూలి పల్కినయాత్మైక్య । భావంబెరింగియుభయమువిడుడి

కృష్ణుడుద్ధవునకు కౌమరొొప్పబోధించు । మాగఁ౦బెరింగియు మాయవిడుడి
పూర్వులెల్లనుబోధించు పూర్ణబోధ । నెరిగివారలు నడచినయటులనడత
నడవనేర్చిన మోక్షంబునతిసులభమ । టంచు వేంకట గురువరుండానతిచ్చె॥ ౨౫

సీ॥ అజ్ఞానభావంబు నణచివేయగలేక । ప్రజ్ఞానమనినోట బలుకనేల
అద్వైతతత్వంబు నాత్మలోఁగనలేక । అహంబ్రహ్మమనినోట ననగనేల
కార్యకారణముల ఖండింపగాలేక । తత్వమసీయని దలపనేల
బ్రహ్మసాక్షాత్కార భావంబెరుంగక । అయమాత్మబ్రహ్మమంచనగనేల
యెన్నివిధములనైనను తిన్నగాను । గన్నవాడిలయపరోక్ష జ్ఞానియనుచు
నిఖిలవేదాంతశాస్త్రముల్ నిశ్చయించు । ననుచు వేంకట గురువరుండానతిచ్చె॥ ౨౬

సీ॥ వేంకటగురు పాద వనజముల్ సేవించి । పరమపవిత్రుడై బాగుగాను
సకల వేదాంత సుసారమౌ సద్గురు । వాక్యతారావళి వ్రాసిగాను
అన్నావధూత వేదాంతశిఖామణి । రచియించిగురునకు రమ్యముగను
అర్పణంబును జేసియానందమొందుచు । నిశ్చలచిత్తుడై నిలచియుండె
యిట్టిగురు వాక్య తారావళైనసిజనులు । వినిన జదివిన వ్రాసినవేడ్కతోడ
జన్మసాఫల్యమును జెంది జయముగలిగి । అంత్యమందున కైవల్యమొందగలర
టంచు వేంకట దేశికుండానతిచ్చె॥ ౨౭

గద్య

ఇతి, శ్రీమత్పరమ భూమానంద యోగీంద్ర అన్నావ
ధూత వేదాంత శిఖామణి విరచితగురువాక్య
తారావళి సర్వం సంపూర్ణము.





శ్రీ గురవే నమః

# అఖండానందబోధార్ధ అద్వైత కందార్ధ దరువులు

## పరిపూర్ణ స్తుతి

శ్రీకైవల్యపదంబై * ప్రాకటముగ వెలుగుచున్నట్టి * పరిపూర్ణంబే * యేకమని నిత్య మదిలో * చేకొని వందనము జేతు * సిద్ధాముగాను * సద్గురునకు వద్దికతోను * శుద్ధ బుద్ధ ముక్త సూక్ష్మస్వరూపమై * వద్దికతో నెప్పుడొక తీరుండెటిదాని * సిద్ధాముగాను* సద్గురునకు వద్దికతోను ॥ ౧ ॥ * * * * *

## అచలబోధ గురు స్తుతి

ధరలో మొగడంపల్లి * నరగురుమల్లేశు చరణ * వనజములను నే * మురయుచు గొలచుచు నీకృతి * నరమరలేకుండ జేతు * నతులితముగనూ * ఆనందబోధకుతు కాము తోనూ * మదిలోన నెప్పుడు మల్లికార్జుని నేను * సతతాము మరువాక స్మరణజేయుచు దీని * నతులితముగనూ * ఆనందబోధ కుతుకాముతోనూ॥ ౨ ॥ *

## గురుపరంపరాభివర్ణన

ఆదికరుడగు నారాయణు * డాకాశము వలె నెప్పూర్ణమై * వెలుగుచుతా * సాకల్యముగను సూర్యుని * కీకీలెరిగించెదీని * నెరిగుండారయ్యా * యిది దెలిసితె మరలి రారయ్యా * యెరుక మరుపుల రెంటిని యెరిగేటి యెరుకాను * పరిపూర్ణముగ జేసె పావనముగు బోధ * నెరిగుండారయ్యా*యిది దెలిసితెమరలిరారయ్యా॥ 3 ॥

ఆరవియాంగురుబోధను * నారయగాయాజ్ఞవల్క్య * కమలముగాంగ * ధీరత నెసగిననాతడు * కారణముగ జనకపతికి * కరుణతో నిచ్చే * శ్రీగురునకతడు శరణాని హెచ్చే * అరమారలేక యిట్లా జనకుడుమాది * మరువాక శుకునకు మరియచలబోధను కరుణతోనిచ్చే * శ్రీగురున కతడు శరణాని హెచ్చె॥ ౪ ॥ * *

శుకయోగీంద్రుండప్పుడు * ప్రకటితముగపూర్ణుడయ్యె * భావములోనను * సకలం బాత్మమయంబని * అకళంకముతోడనుండు * టదివినివచ్చి*సాందీపులు మదిలోన హెచ్చి * ముదముతో శుకయోగి పదయుగములుబట్టి * వదలకయాబోధ * వాసిగ తాబొందు * టదివినివచ్చి సాందీపులు * మదిలోనహెచ్చి॥ ౫ ॥

శ్రీకృష్ణుండీబోధను * ప్రాకటముగబొందితాను * పరిపూర్ణుండై * చేకొనిరుక్మిణిదేవికి * సాకల్యముగాను దెల్పె * సమరసజ్ఞానం * సంతసమూన * విమలసుజ్ఞానం కమలాశ్రీధరునకు * కరుణాచెసీమర్మ * మమలంబుగాయుచల * మగునట్లుగాదెల్పె * సమరసజ్ఞానం * సంతసమూన విమలసుజ్ఞానం ॥౬

స్వామిశ్రీధర గురువరు * డేమాయల బొందకుండ * నెపుడతడుండగ *రామావధూతవచ్చియు * యామాహాత్మ్యమునుజూచి* యచ్చెరువుగానూ * గురునకుమనసిచ్చె గానుకనూ * స్వచ్ఛముగనుబోధ కృపజేయుమని వేడా* నిచ్చెయవధూతకు నీమహాగోప్యము * యచ్చెరువుగాను * గురునకుమానసి చ్చెగానుకనూ॥ ౭॥

రామావధూతివద్దను * స్వామిసదానందయోగి * సమ్యగ్జ్ఞానం * బేమాయ లేకబొందియు * కామాంధులమూర్ఖమెల్లా * ఖండించెలెస్సా * వాదిజనమూలదండించె లెస్సా * అండాబాయనివెంకటార్యులకీకీలు * దండిగాదెల్పిన * ధగనుమూర్ఖులబోధ ఖండించెలెస్సా * వాదిజనమూల దండించెలెస్సా ॥ ౮॥

వెంకటయోగీంద్రునిపద * పంకజములుగొలచియాత్మ*పరిపూర్ణంబై * సంకటములెల్లవదలియు* శంకలుడిగినీకృతిని నే * జేసేదనయ్యా * జన్మములానుబాసీనాన య్యా * ఆశాలువొదలీనయన్నావధూతను * వాసీగశ్రీగురువరునకర్పించినే * జేసేదనయ్యా * జన్మములానుబాసీనానయ్యా ॥ ౯ ॥

( గురుశిష్యసోఽస్య దర్శనము )

సాధనచతుష్టయంబులు * మోదముతోగల్గినట్టి * ముఖ్యుండొకడుగ * యేదరిగానకసద్గురు * పాదంబులవద్దజేరి * పావనుడిలనూ * సద్గురుసేవ భావాములోను సావధానముగాచేసలుపూచుగురునిస * ద్భావమొందుటకునై * బహుదినములదాకా పావానుడిలనూ * సద్గురుసేవ భావాములోనూ॥ ౧౦ ॥

గురురాయనిన్నునామది * స్మరియించెదనాదుపాప * సంఘములెల్లన్ * బారి
యలుగజేయవేయని * పరితాపమునొందుశిష్యు * భావాముగనియెన్ * దయతోడు
తవేవేగననియెన్ * రావయ్యశిష్యాగ్రగనివేలజడిసేవు * పావనునిగజేతు భయమొంద
కనిశిష్యు * భావాముగనియెన్ దయతోడుత వేవేగననియెన్ ॥ ౧౧ ॥

అడగంగవలయుసంశయ * మడుగంగావలయుదెలియ * వమలవిచార* తడవి
కజేయకనడగిన * విడపించెదసంశయంబు * వినరాకుమారా * పరమార్థముగనరాకు
మార * అనుమానములుమాని యాత్మసంశయమెల్ల * మనసందునుంచకమరిమరి
యడిగిన * వినరాకుమారా * పరమార్థము గనరాకుమారా ॥ ౧౨॥

కరుణన్ సద్గురువరుడి * ట్లరమరలేకుండబల్క * నదివినిశిష్యుం * డిరవొందగ
తానప్పుడె * పరమానందంబుతోడ * పరమాత్ముడనుచున్ * సద్గురువరుని మర
యాచుగలిసెన్ * శరణుశ్రీగురువర * శరణుసర్వేశ్వర * శరణుపాపసంహార *
శరణార్థియనిగురుస * పరమాత్ముడనుచున్ * సద్గురువరునిమరయాచుగలిసెన్ ॥౧౩

తరమాసంసారమునే * భరియింపగజాలనాదు * పాపాటవులన్ త్వరితముగ
కాల్చివేసియు * మరయాచునన్నేలుకొరకు * మోక్షదస్వామీ* భ్రమలకునన్నా
జిక్కనియ్యకుమీ * చక్కగమీపాదసరసీజయుగమూల * నిక్కముగానాహృ
న్నీరాజమునదిల్పి * మోక్షదస్వామి * భ్రమలకుననన్నాజిక్కనియ్యకుమీ ॥౧౪॥

కరుణాసాగరుడనినీ * కరుణకుపాత్రుండనైతిగావుననేని * నరకములతిరిగిబడక
ను * మరిపెముతోనుండునట్టి * మూలముదెల్పి * నీయాజ్ఞాలోచాలానన్నిల్పి* వా
లాయముగనేనీ వసుధాజన్మించాని * కాలాతీతంబైనఘనమగుమీబోధ * మూలా
ముదెల్పి * నీయాజ్ఞాలోచాలానన్నిల్పి॥ ౧౫ ॥

యెన్నిజపంబులుజేసితి * నెన్నివిధంబులనుదేవతార్చననేనున్ * పన్నుగయో
గాభ్యాసము * లెన్నెన్నోజేసిమోక్షు * మెరుగాలేనైతీ * అరివర్గములనరుకాలేనైతీ
ధరలోనమీవంటి ధన్యులిదివరకూను * అరమారలేకనాకగుపడనందున * యెరుగా
లేనైతి * అరివర్గములనరుకాలేనైతీ ॥ ౧౬ ॥

నేనెప్పుడనిజన్మం*బోనిర్మలచరిత నాకదె దుకుగలిగెన్ * యీనిశ్చయంబునా
కను * మానములేకుండదెల్పిమన్నించవయ్యా * నీపదమూలనెన్నేదనయ్యా * కన్ను

తండ్రివటంచు * కావుమటంచునే * నిన్ను నమ్మితిగాదె నిజముగాగనన్నేలి * మన్నించవ గయ్యా * నీపదమూల నెన్నెదనయ్యా ॥ ౧౭ ॥

వాహ్వారెమంచివాడవు * మహాబాసురమంచిశంక జేశితివానీ * సాహసమునకే మెచ్చితి * బాహాటముగానునీతో * బలికేదపుత్రా * బోధామృతముజిలికేదాపుత్రా యిలలోనెప్పుడునీవికజన్మించనియట్లె * బలమైనయీబోధపాటించినీవెరుగ * బలికేద పుత్రా * బోధామృతము జిలికేదాపుత్రా ॥ ౧౮ ॥

ధీనిధివినీవుగనుకను * మానసమునన్నిట్టియుక్తి * మల్లడిగోనగ * యీనిశ్చయంబు జేసితి * వానిశ్చయమెల్లనీకు * నమరాదెల్పెదనూ * దృఢముగనమ్ము విమలాముగానూ * క్రమముగా ద్వంద్వముల * ఖండించియూవైన * సమరాసమై వెలుగుస్వానుభావమునీకు * నమరాదెల్పెదనూ * దృఢముగనమ్ము * విమలాముగానూ ॥ ౧౯ ॥

అజ్ఞానమువిడిపించెద * సుజ్ఞానముచేతనిన్ను * జూపెదతండ్రి * విజ్ఞానయుతుడ వైనీ * ప్రజ్ఞలనికనెల్లవదలి * భక్తితోనమ్మా * భ్రమగుణమూలయుక్తితోజిమ్మా భక్తివిరక్తివై భవమాత్మజ్ఞానము * ముక్తిమూలములోనీమాటినివదలక * భక్తితోన మ్మా * భ్రమగుణమూల యుక్తితోజిమ్మా ॥ ౨౦ ॥

రావయ్యాశిష్యవర్యా * వేవేగమెనీకునేను * వేదాంతార్థం * భావించితెలియ జెప్పెద * నీవికసంశయమునవదలి నిజముగావినుమా * యిక్కడినుండిసుజనులగనుమా అజమనామయమమృత * మమలామానీబోధ * భజియించనీజన్మపావానమగుతండ్రి నిజముగావినుమా * యిక్కడినుండి సుజనూలగనుమా ॥ ౨౧ ॥

## * గురూపదేశము *

నేననినమేనుగానని * మానసమునదృఢము జేసి * మరితనయాత్మగ * పూనిగ నుంగొనువారలు * మానకనెపుడాత్మతత్వ * మహిమానరయుదురూ * నిర్మలమైనమ హిమనరయుదురూ * ఆవరణజ్ఞానభ్రాంతీవత్ సర్వజగంబు * రజ్జుసర్పమనుచు * ననవ రతంబాత్మ * మహిమానరయుదురూ * నిర్మలమైన మహిమానరయుదురూ ॥ ౨౨ ॥

నాలుగువిధములనొప్పెడి * మేలగుగురుసేవలందు * మెలగుచునెపుడుగ * యీ లోకమోహములువిడి * చాలాగురుభక్తిగల్గి * సమరాసామొదూ * నీలోనీవువిమ

లాముబొందూ * అమలానైనిష్కళ * మాద్యంతరహితమై * సమమయ్యి వెలిగేటి
స్వానుభూతాన్వయ * సమరాసామొందూ * నీలోనీవు విమలాముబొందూ ॥ ౨౩॥

దీక్షాత్రయములబొందక * అక్షయముగబోధరూపు డగుటెట్లన్నా * సాక్షిగ
నుపెండ్లినెరుగని * పక్షులముక్తైద యనుట పాపానవిన్నా * ముక్తైదాత్రో సాటిగా
దన్నా * సత్తైసగురు పూజ సలుపానివెధవాలు * నిత్యమహంబాని నిరతముబలికిన
పాపానావిన్నా * ముక్తైదాత్రో సాటిగా దన్నా ॥ ౨౪ ॥

బంధమోక్ష విచారణము

తనయాత్మదానెరుంగక * మనమునదలపోయునితరమార్గంబెవడో * ఘననై
నమోహవార్ధిలో * నసయంబునుమునుగుచుండు * టదియేబంధమురా * మహా
త్ములకదియెబంధమురా * హృదయసంకల్పములుడుగక యేప్రొద్దు * మదమునదిరిగేటి
మాయాంధకారుల * కదియెబంధమురా * మహాత్ముల * కదియెబంధమురా॥ ౨౫

తనసంకల్పమెబంధము * తనసంకల్పక్షయంబె*తెగమోక్షమటం* చనయంబు
నాత్మవేత్తలు * మునుబల్కినపల్కులెల్లా మురయుచువినరా * విన్నదయామమరి
మరిగనరా * అరమరలేక నీవాత్మతత్వముగాంచి * పరిపూర్ణమైనీవు పరమామృతము
గ్రోలి * మురయుచువినరా * విన్నదయామమరిమరిగనరా॥ ౨౬ ॥

మహావాక్య విచారణము

ప్రజ్ఞానంబ్రహ్మంబని * సుజ్ఞానముచేతదాని * జూచుచునెపుడున్ * విజ్ఞాన
యుతుడవైనీ * ప్రజ్ఞలనికవదలుకోని పరమాత్మగనరా * గనుగొనయాత్మపరిపూర్ణ
మారా * నిరతమొక్కరీతి నిర్మలస్థితితోడ * వరరాజయోగివై వదలకనీలోన * పర
మాత్మగనరా * గనుగొనయాత్మ పరిపూర్ణమారా ॥ ౨౭ ॥

బ్రహ్మైవాహంబనుచును * బ్రహ్మంబేననుచువిగత * పాపుడవగుచున్ * బ్ర
హ్మధ్యానముజేయుచు * బ్రహ్మండముమిథ్యయనుచు * పాటించిగనరా * గురుబో
ధాత్రో సాటిలేదనరా * బూటకములకిక పోబోకనీయాత్మ * సూటిదప్పక నెపుడు
సుస్థిరమగుబోధ * పాటించిగనరా * గురుబోధాత్రో సాటిలేదనరా ॥ ౨౮ ॥

తత్వమసియనుచుసద్గురు * తత్వాంజనమేసినిన్ను * తప్పకజూపన్ * తత్వజ్ఞు
డవైనీవి తత్వంబులకందరాని * దారినెరిగెదవూ * సద్గురువాక్య సారమెరిగెదవూ

సారహీనంబా సంసారసాగరమును * మీరి బ్రహ్మజ్ఞాన మిదియని దెలిసినీ * దారినె రిగెదవ్వా * సద్గురువాక్య సారమెరిగెదవ్వా ॥ ౨౯ ॥

అయమాత్మ బ్రహ్మంబని * నయముగనినుసీ వెజూచి *నవవరతంబుగ * భయ మెల్లవదలిసద్గురు * దయకునుపాత్రుండవయ్య * తరుముగుణములను * పరిపూర్ణము నిరతముగనుమూ * సరిలేక వెలిగేటి సత్యజ్ఞానానంద*మరయుచుని వెప్పు డపరోక్షజ్ఞాని వై * తరుముగుణములనూ * పరిపూర్ణము నిరతముగనుమూ ॥ 3౦ ॥

శ్రోతవ్యము మంతవ్యము * ధ్యాతవ్యంబనెడిమూడు * తరగతులెపుడుగ * ఖ్యాతిగవదలకనుండిన * అతతవిజ్ఞానమయుడ * వై వెలిగెదారా * నీవే బ్రహ్మమై వెలి గెదారా * భావాభావములకభావమైనిత్యమై * భావింపరానియూపరమాత్మతత్వమీ వై వెలిగెదారా * నీవేబ్రహ్మ మైవెలిగెదారా ॥ 3౧ ॥

కొందరుకలదనియందురు * కొందరు లేదందురాత్మ * కొమరొప్పంగ * అం దునవిందునజెందక * సందేహము లేనియట్టి సత్యజ్ఞానముగా * అంతటదాని నిత్యము గనరా * సత్యాసత్యములాకు సాక్షిచిదానంద * మత్యంతవిమలమై * యనవరతము వెల్గు * సత్యజ్ఞానముగా * అంతటదాని నిత్యముగనరా ॥ 3౨ ॥

యిరువదినాలుగుతత్వము * లరయంగాగూడిదేహ * మాయగదన్నా * నిరు వద్యమైదవవాడే నిరతముకూటస్థుడయ్య * నెగడుమాయన్నా * అతడే బ్రహ్మమగణి తుడన్నా * నిగమాంతవేద్యుడై * నిత్యప్రకాశుడై * జగమెల్లనిండితా జననమరణ ములేక * నెగడుమాయన్నా * అతడే బ్రహ్మ మగణితుడన్నా ॥ 33 ॥

మాయావిద్యలగూడిన * పాయకజీవేశులనెడి * పద్ధతిగలిగె * మాయా విద్యలవదలిన * మాయాతీతుండుబ్రహ్మ * మాయగదన్నా * భయముపీడిపోయెగ దన్నా * వేయువిధములాను వేదాంతసారము * ధీయుతుడైయిల తిన్నగతాబ్రహ్మ మాయగదన్నా * భయముపీడి పోయెగదన్నా ॥ 3౮ ॥

లేనిజగంబును లేదని * మానసమునవెరిగి * నితరమాయలబడకగ * మాన సముత్తోడసర్వము * జ్ఞానముచే నీలోనిన్ను* గనరాకొమారా * నాపలుకులు విన రాసుధీరా* అనయమునిన్ను నీవాలోకనముజేసే * ధనముసంపాదించి * తత్వజ్ఞానం బున * గనరాకుమారా * నాపలుకూలు వినరాసుధీరా ॥ 3౫ ॥

కలవంటిదీజగంబని * కలకాలముజూచిదీని * ఖండించిపయిఁ * చలనంబు బొందకుండను * తలపులనికవీడినిన్నే దలపుమువత్సా * నీలోనిన్నే దెలియుముఃవత్సా అలయకసోలయక నరమరలేకుండ * పలుకులకందని పరమార్థమెప్పుడు * దలపుము వత్సా * నీలోనిన్నే దెలియుముఃవత్సా ॥ ౩౬ ॥

యోగులమనుచునుకొందరు * వాగెదరెప్పుడునువారి* వర్తనలందుఁ * బాగుగదిరిగెడివారలు * యోగడముఃలబొందగలరో * రౌరామాయప్పా * వారలుపాపులౌరామాయప్పా * ధీరతతోనాత్మదివ్యజ్ఞానంబెరుగు * వారికేసాధనవలదువలసిన పాపులౌరామాయప్పా * వారలుపాపులౌరామాయప్పా ॥ ౩౭॥

మూఢాత్ములైనజనములు * వాదుకచేనెప్పుడాత్మ * వచ్చునుబోవుఁ * గూడుకొనియుండుననుచును * గాఢాంధములోనజిక్కి గనజాలరప్పా * జ్ఞానులదివినజాలరప్పా * అనయమొక్కరీతి ఆత్మవెలుగుచునుండ * దనుచుమోహాములెల్ల * మాననిమూర్ఖులు * గనజాలరప్పా * జ్ఞానులది వినజాలరప్పా ॥ ౩౮ ॥

ప్రొద్దునమేలుకమొదలుగ * నిద్దురయునువచ్చుదాక * నిర్భరముగయే * సుద్దులనుదగలకనునే * సుద్దులకునుబోకనిన్నే జూడరపుత్రా* గుణములనెల్ల వీడగపుత్రా * ఆడయీడనకను యీడజూచిననిన్నె * వేడుకతోడుత వేయువిధంబుల *జూడరపుత్రా * గుణములనెల్ల వీడరపుత్రా ॥ ౩౯ ॥

( మూర్ఖవాదనిరసనము )

చపలాత్ములయ్యుకొందరు * విపరీతపుమార్గములను * విడువగలేకఁ * నిపుణులముమేమటంచును * కపటాత్ములుబల్కునిజము * గాదుగాదన్నా* ఛీఛీ వారిబోధవినకన్న * యేదారినెరుగాని వెధవాలుజనులాతో * వాదూలుజేతురువ్యర్థుఁలుగనుకాది * గాదుగాదన్నా * ఛీఛీ వారిబోధవినకన్నా ॥ ౪౦ ॥

యీడాడనకనువెలిగే * జాడగనుంగొనగలేని * జడులిలలోలఁ * మూఢాత్ములయ్యువదరే * వాదుకలనుజిక్కకుండ * వదుగూముతండ్రీ * నీవెప్పుడుముదమూననుండి * సదమలముగవెలిగె * సత్యజ్ఞానానంద మదియేనిజంబని * యఖిలభ్రమలను వీడి * వదుగుముతండ్రీ * నీవెప్పుడు ముదమునునుండీ ॥ ౪౧॥

లోనిద్రబైటినిద్రని * మానకపదిరేటివారు * మాయకులనుచుక్ * పూనిగ నుంగొనివారల * గానకనీలోనని న్నే గాంచుకొమారా * బ్రహ్మముగానిన్నెంచుసుధీ రా * అంచితముగనీలో నఖిలమున్న దెరిగి * వంచనగుణములవదలి·అంతటనిన్నే * గాంచుకొమారా * బ్రహ్మముగా నిన్నెంచుసుధీరా ॥ ౪౨ ॥

లోచదువుబైటిచదువని * వాచాజ్ఞానమునబలికెవారలనడకల్ * నీచమనిమది నెరింగియు * నీచందముదెల్పుచదువు * నిజమనినమ్మా * మదమనియేటిగజమును జిమ్మా * సుజనులమార్గముజూచిసద్గురుమూర్తి * భజనసేయుచువారి * పాద పద్మంబులు * నిజమానినమ్మా * మదమనియేటి గజమానుజిమ్మా ॥౪౩॥

మాటికిదర్పముజూపే * బూటకులనునమ్మకుండ * పూర్ణాత్మసునీసూ టెప్పు డుదప్పకుండిన * సాటెవ్వరువారునీత్రో సత్యాముగానూ * అంతటజూడునిత్యాముగా నూ * సత్యజ్ఞానానందస్వానుభావమును * అత్యంతముగగ్రోలి * యఖిలభ్రమలను వీడి సత్యముగానూ * అంతటజూడు నిత్యాముగానూ ॥ ౪౪ ॥

ఎక్కడజూచిననిండియు * చక్కగతావెలుగుచుండు * సత్యజ్ఞానంబిక్కడగల దనిజూపిన* నక్కడలేదాయగాదె నదియేటిజ్ఞానం* అంతటజూడు మిదియేసుజ్ఞానం * మదిసంకల్పములెల్లమానకనిటువాలె * వదరుచునెప్పుడువరగురు నెరుగని * దదియేటి జ్ఞానం * అంతటజూడు మిదియేసుజ్ఞానం ॥ ౪౫ ॥

లోచూపుబైటిచూపని * వాచాజ్ఞానంబుచేత * వదరుచుదిరిగే * నీచాత్ము లందుజేరక * నీచాతుర్యమునముక్తి * నీవెరుగవయ్యా * గురునిమదిభావించవయ్యా యీవిధమునయుక్తియింపుగగూర్చక * భావవిహీనులపలుకులవిడినిన్ను * నీవెరుగ వయ్యా * గురునిమది భావించవయ్యా ॥ ౪౬ ॥

―― * మాయా వివరము * ――

కలలోదేహములెన్నో య్య * గలిగినయటుదోచిపిదప గానగరాకన్ * కలగన్నవా డెనిలచును * కలలోపలిచిత్రములకు * గడబడయేలా * అందుకునీవుతడబడుటేలా నడుమంత్రమునవచ్చి * నడుమంత్రమునుండి నడుమంత్రమునబోవు * నటువంటిమా యాకు * గడబాఁడయేలా * అందుకునీవు తడబాటుటేలా ॥ ౪౭ ॥

మాయయనలేనిదాయను * పాయకనున్నట్లుదోచు * బహుబద్ధులకున్ * వే యువిధంబుల సద్గురు * ఛాయక సేవించునట్టి * పావనాత్ములకు * మాయనె లేదు కేవలాత్ములకు * భావాభావములాకు * భావింపరానియా * కేవలమగు దానికీలు దెలిసినట్టి పావనాత్ములకూ * మాయనె లేదు కేవలాత్ములకు ॥ ౨౮ ॥

అకళంకంబగు పూర్ణము * సకలవ్యాపకమునయ్యె * సకలంబయ్యున్ * సకలాతీతంబయ్యె * వికలములేకుండ వెలుగు * విధముగనుగొనరా * సద్గురుమహిమవిధముగనుగొనరా * హృదయామునెపుడు పొంగుచునినునీవు * సదమలమైనట్టిస్వానుభావమునొందె * విధముగనుగొనరా * సద్గురుమహిమ విధముగనుగొనరా ॥ ౨౯ ॥

పలుమాటలపనియేమిక * కలవంటిదిమాయయనుచు * గనుగొనినంకన్ * చలనంబు లేలగలుగును * యిలసర్వంబిడచియుండు * టదియె మోక్షమురా * తన్నెరిగిన దదియెసాక్షౌరా * అదియాదె యిదియిది * యిదెయనెడి భ్రిమవీడి * అదియిదియనుభావ మమరినవారల * కిదియే మోక్షమురా * తన్నెరిగినదదియెసాక్షౌరా ॥ ౩౦ ॥

భక్తిజ్ఞానవిరక్తులు * ముక్తికిమూలంబులనుచు* మురయుచుజీవన్ * ముక్తులు బలికెటిపలుకులు * యుక్తినిగనివీటినెప్పుడిడువాకోయన్నా * మాయకునీవుఝుడియాకోయన్నా * తడబడకనునీదు తత్వంబు నెరిగియు* పుడమిలోనెప్పుడుపూర్ణగురుని సేవ విడువాకోయన్నా * మాయకునీవు ఝుడియాకోయన్నా ॥ ౩౧॥

నినునీవెరుగుటకొరకై * మనమునసంకల్పమెల్ల * మానుమువత్సా * అనయము సద్గురుమూర్తికి * వినయంబున సేవజేసి * వినరాకుమారా * బ్రహ్మము నెపుడు గనరాసుధీరా * తనయాదుర్గుణముల * తప్పకఖండించి * ఘనమగునీయాత్మ కడతేరేగురుబోధా * వినరాకుమారా * బ్రహ్మము నెపుడు గనరాసుధీరా ॥ ౩౨ ॥

జపములు జేసిననైనన్ * ఉపవాసములున్నమరియు * నుర్వీవ్రితముల్ *తపములు జేసిననైనన్ * విపరీతపుమనసువిడువ కికలేదు మోక్షం * తన్నెరిగినసకలాముసూక్ష్మం * అకళంకమగుబోధ * నాత్మనిశ్చయమైన * ప్రకటితముగపూర్ణ * భావమెరుగనివారి * కికలేదుమోక్షం * తన్నెరిగిన సకలాముసూక్ష్మం ॥ ౩౩ ॥

గురురాయుని చేవినకను * మదిగర్వమునొందిదృష్ట * మానవులుధరన్ * దిరుగుచుపెద్దలమాటలు * నరమరలేకుండనేర్చి చూడినగలదా* పాటలుకొన్ని పాడినగలదా

యాడదగినమాటలాడ నేర్చినగురుని * జాడ దెలియక ముక్తి జాడల మాటలెన్నాడినగల దా * పాటలుకొన్ని పాడినగలదా ॥ ౫౮ ॥

లీలానంద నిభావము * లీలానందమునమనసు * లీనము జేయక * వాలాయమె రుగవచ్చును నీలోనాశ్చర్యమెల్లా * నీవెరుగుతండ్రీ * గురుబోధనీభావామునుండీ * సావధానముగానె సమరసజ్ఞానము * యేవిధమునైన నెప్పుడుమరువక * నీవెరుగు తండ్రీ * గురుబోధ నీభావమునుండీ ॥ ౫౯ ॥

దినములువ్యర్థముగాకను * గనుచుండుముయాత్మనెపుడు * ఘనగురుబోధగ నినునీవెరుంగకున్నను * అనుమానమువదలకుండు * టదియెపాపమురా * పాపముగ ల్గుటదియెతాపమురా * మదిసంశయంబులు మానకనుండితా * మదమత్సరములను మరిగివిడువగలేని * దదియెపాపమురా * పాపముగల్గు టదియెతాపమురా ॥ ౬౦ ॥

(*సు జ న ల క్ష ణ ము*)

ఘనుడగుచంద్రుండొచ్చిన * వననిధులుపొంగినట్లు * వసుధాల్పనదుల్ * న నయంబుపొంగనేర్చునె * యనుమానములేకజ్ఞానియాత్మజ్ఞుమెచ్చు * మెచ్చితనయా త్మలోహెచ్చు * ఆత్మజ్ఞానములేని యధముడెటువలెమెచ్చు * ఆత్మతత్వంబెరిగినట్టి సు జ్ఞానిని యాత్మజ్ఞుమెచ్చు * మెచ్చితనయాత్మలోహెచ్చు ॥ ౬౧ ॥

పతిదైవంబనుపతివ్రత * పతినెన్నడు మెచ్చబోదు * వ్యభిచారిధరణ * సతత ముపతిశుశ్రూషలు * వ్రతముగ నేసల్పునట్టివనితామెచ్చునురా * పతివ్రతలనుగని తా హెచ్చునురా * అనయముగురుసేవలటువలె జేసేడీ * ఘనునిజ్ఞానులువినుతిగావింపగా ముక్తి * వనితమెచ్చునురా * పతివ్రతలను గనితాహెచ్చునురా ॥ ౬౨ ॥

ప్రాణంబులబిగబట్టియు * మానితముగజూచువారి * మార్గముకల్లా ధీరులైమ రలజన్మను * మానగలేనట్టివారి మార్గముల్లక్క * వారికియపవర్గముల్లక్క * నిర్గు ణబోధనునిశ్చయింపకయప * వర్గముగలదాని వదరుచుండెటివారి మార్గముల్లక్క * వారికి యపవర్గముల్లక్క ॥ ౬౩ ॥

లోకులమాటలువిన్నను * కాకంబులకూతలనుచు * ఘనులెంచునురీ * చీకా కుబొందకనుమది * యేకాకారంబుగానె యెప్పుడుండెదరూ * సాధనములనొప్పకుం

దెదరూ * తప్పకనెప్పుడు తత్వార్థమెరుగుచు * తప్పకుమార్గములతలపులోననెపుడు
వొప్పకుండెదరూ * సాధనములనొప్పకుండెదరూ ॥ ౬౦ ॥

తనలోనెతానుబయలై * యనుమానములెల్లమాని * యచలంబై తా * ఘన
పూర్ణబోధనొందిన * జనుడా? మాతండుముఖ్య * జగధీరుడన్నా * అతనికియీజగము
లేదన్నా * భగవంతుడతడే సత్పావానుడతడేయూ * నిగమాంతవేద్యుడౌ * నిత్య
ప్రకాశుడై జగధీరుడన్నా * అతనికియీజగములేదన్నా ॥ ౬౧ ॥

జగమనగనింద్రజాలము * జగమనగామాయయగును * జగధీశుండౌ * భగవ
ద్వాక్యమువినియీ * జగమెరిగినబాసనికిని * జంధ్యామది యేలా * జ్ఞానములేనిసంధ్య
వాచేలా * సంధ్యకాలంబేదో సంధ్యయగనేదో * సంధ్యావాచనుయాత్మ *
సంధిదెలియనివారి * జంధ్యామది యేలా * జ్ఞానములేని సంధ్యావాచేలా ॥ ౬౨ ॥

నీవన్ననునేనన్నను * భావంబుననెరుగునొక్క * భావమెకాదా * భావంబులెల్ల
విడి * నిర్భావంబుననుండిసీలో * పరమాత్మగనరా * గనుగొనియూని * వరమరవి
డరా * పరిపూర్ణనిర్గుణబ్రహ్మమేనేనని * నిరతమొక్కరీతి * నిస్సంశయంబుగ * ప
రమాత్మగనరా * గనుగొనియూనీ వరమరవిడరా ॥ ౬౩ ॥

జీవుడుయీశ్వరుడనుచును * భావింపుచునుండ్రుకర్మబద్ధులుధరలో * జీవేశ్వరు
లనమాయా * భావించిదిమిథ్యయనుచు * భావించవయ్యా * అంతటనిన్నే సేవించ
వయ్యా * యీవట్టిభ్రమలకునికమోహమొందక * సావధానముగానెసమరసజ్ఞానము
భావించవయ్యా * అంతటనిన్నే సేవించవయ్యా ॥ ౬౪ ॥

## (*) సగుణనిర్గుణవిచారము (*)

సగుణంబనినిర్గుణమని * యగణితముగబల్కగలరు * నటుకొందరిలన్ * సగు
ణమునిర్గుణమగునా * మరినిర్గుణమెప్పుడుసగుణమగునా కుమారా * యీలాగనదగు
నాసుధీరా * నిగమాంతవేద్యుడు నిత్యప్రకాశుడు * అగణితపరిపూర్ణమైనబ్రహ్మము
సగుణ * మగునా కుమారా * యీలాగనదగునాసుధీరా ॥ ౬౫ ॥

యిదివట్టిమాయయనుచును * మదమున నీవోగిదీని * మోహములెల్లన్ *
పదపడిఖండించిననీ * కుదయించును బ్రహ్మబోధ * నుహుగుమోహంబు * గుణముల

నెల్లకడుగు యేహ్యంబు * వడలాత్మయనుమాట వట్టిమోహంబని * తడయకపరిపూ
ర్ణతత్వమెరింగినీ * వుడుగుమోహంబూ * గుణములనెల్లకడుగుయేహ్యంబు ॥ ౬౬ ॥

సగుణంబనగనుమాయా * సగుణంబన నదియుసర్వ * సంకల్పంబుల్ * సగు
ణంబునంటకుండను * యగణితముగ వెల్గుబ్రహ్మ * మదియెనీవన్నా * మోహముసొం
దవిడినీవుగన్నా * ముదమునసీయొక్క ముఖ్యార్థ మెరిగిన * సదయుడై వెలిగేటి స
త్యజ్ఞానానంద * మదియెనీవన్నా * మోహముసొంద విడినీవుగన్నా ॥ ౬౭ ॥

సగుణంబనగను లేనిది * సగుణంబననదియెమోహ * జాలము లెల్లన్ * సగు
ణంబువదలినిల్లో * దగనిర్గుణతత్వమెప్పుడు దలచుకుమారా * దానిలోమనసు నిలుపు
గంభీరా * చలనచలనములోను * జెందకనీ కెందు గలయాకా నెప్పుడు * ఘనపరబ్ర
హ్మము * దలచుకుమారా * దానిలోమనసు నిలుపుగంభీరా ॥ ౬౮ ॥

యెక్కడిసగుణముసిర్గుణ * మెక్కడిమాయాప్రపంచ * మెవ్వడుజేసెన్ *
యెక్కడినుండిదివచ్చెను * చక్కగవివరింపమోహ * జాలామోయన్నా * యీభ్ర
మలెల్ల చాలించవన్నా * వాలాయముగసర్వవాంఛలదగిలీయు* కాలాకాలములకు
కట్టుబడినజగ * జ్జాలమోయన్నా * యీభ్రమలెల్ల చాలించవన్నా ॥ ౬౯॥

(*) జగన్మిథ్యా విచారణము (*)

పరిపూర్ణమైన నిర్గుణ * పరవస్తువజగము నెట్లు భావించియుతా * నరమర లేక
నుజేసెను * నిరతంబిదివట్టిమాట * నిజమెరుగుపుత్రా * సద్గురునెపుడు భజియించు
పుత్రా * అజమానమయమమృత మాద్యంతరహితంబు * సుజనులకెల్లను సులభమై
వెలిగేటి * నిజమెరుగుపుత్రా * సద్గురునెపుడు భజియించుపుత్రా ॥ ౭౦ ॥

వననిధియందునతరగలు * ఘనముగజనియించునట్లు * గతిసద్బ్రహ్మం బున
దగుపరిపూర్ణంబున * జనియించిన మాయకింతా * జెప్పగనేలా * యీమోహము
లొప్పకుచాలా * యెప్పటికొకరీతి యేనుండునటుచునే * తిప్పలుబడకనీ వొప్పియుండి
తెబహు * జెప్పగనేలా * యీమోహములొప్పకుచాలా ॥ ౭౧ ॥

మొదలైతే లేశదేకద * తుదకైనా లేనిదనుచు *దోచునుగాదా * యిదిమిథ్య
గానుపించిన * యిది మిథ్యయటంచుదీని * నెంచగరాదా * మోహాటవి ద్రుంచగ

రాదా * సంచితాదికర్మజాలములెల్లనా * కంచితంబుగను లేవంచునీయాత్మసీ * వెం
చగరాదా మోహాటవి ద్రుంచగరాదా ॥ ౨౨ ॥

లేనిది లేదనిచూచే * యానిర్మలుడైనయోగి * యమలుండగుచున్ * పూని
గనుంగొనతన్నే * తాననిసకలంబుమరచు * తధ్యామోయన్నా * యీజగమెల్లమి
ధ్యానోయన్నా * మధ్యవచ్చినమాయ మధ్యనేపోవునీ * బుద్ధ్యాదులకుసాక్షిపూర్ణ
మెప్పటికుండూ * తధ్యామోయన్నా * యీజగమెల్లమిధ్యానోయన్నా ॥ ౨౩ ॥

పరిపూర్ణంబుపురాణము * పరమాత్మబ్రహ్మమెపుడు * భాసిలుచుండన్ *
నరులదిగానగలేకన్ * మరిమరి మోహంబులందు * మరిగిరితండ్రీ * జన్మములందు
దరిగేరుతండ్రీ * గురుసేవాజెయ్యాని కుటిలాత్ములిటుమదకరిచేతజిక్కియు * ఘనభ్రి
మలనుబొంద * మరిగిరితండ్రీ * జన్మములందుదరిగేరుతండ్రీ ॥ ౨౪ ॥

వేదంబులుబహుచదువుచు * వేదాంతార్థంబెరుంగ* పశేమునుగాకన్ *మో
దంబుజెందినామని * వాదంబులుజేసితేమి వచ్చేకుమారా * జ్ఞానులకిది మెప్పౌనా
ధీరా * యిచ్ఛాకల్పనజాల మిదిసద్గురునివల్ల * స్వచ్ఛముగావినని శుంఠలుచదివితే
మొచ్చేకుమారా * జ్ఞానులకిదిమెప్పౌనాధీరా ॥ ౨౫ ॥

ఆకాశాదికభూతము * లేకంబై జగములాయ * నెన్నివిధములన్ * ఆకాశ
ముశూన్యంబని*ప్రాకటముగబల్కు శాస్త్ర పద్ధతిగనరా * లేనిజగమునుద్దు లేటికిరా*
కద్దులేవనక నేకారాణామెంచక * ముద్దుగవెలిగేటిముఖ్యమానీయాత్మ * పద్ధతిగనరా
లేనిజగమునుద్దులేటికిరా ॥ ౨౬ ॥

గురువులమనుచును కొందరు * వరబోధనుదెలియలేక * వదరుచుదిరిగే * న
రపశువులకడబోకను * విరివిగసద్గురునిబోధ * వినరామాయన్నా * బ్రహ్మమునెపు
డు గనరామాయన్నా * వినయభయభక్తులు విడువక సద్గురు * ననయమునుసేవించినమ
లమాగురుబోధ * వినరామాయన్నా * బ్రహ్మమునెపుడు గనరామాన్నా ॥ ౨౭ ॥

పెద్దలమనితమమర్మము * ముదమున గానంగలేని * మూఢాత్ములిలన్ *
మొద్దులవలెదిరిగెడియా * ముద్దులకునుమోక్షమెట్లు మొనయుకుమారా * వారికి
గర్వ మెనయుసుధీరా * అనుమానముపీడ కందారిలోజేరి * ఘనవాదములుజేసే
కర్మలకెటుముక్తి మొనయుకుమారా * వారికిగర్వ మెనయుసుధీరా ॥ ౨౮ ॥

తరమా పరమాత్మనుగన గురుసేవలుజెయ్యలేని * కుటిలాత్ములకున్ వరగురుని సేవ జేసెడి * పరిశుద్ధులకాత్మపట్ల పగలౌకుమారా వారికిమాయా జగము లేదారా * అగణితముగగురు నాత్మలో నెరనమ్మి యుగులువిడచిన వెనుక పూర్ణ బోధపట్ల * పగలౌకుమారా వారికిమాయా జగములేదారా ॥ ౭౯ ॥

అకలంకాత్ముల కెప్పుడు వికలంబునుగలుగకుండు * వినుమాయయ్యా సక లంబుబ్రహ్మంబనుచును ప్రకటితముగజూచువారే * పావానులన్నా యితరము వారు భావించరన్నా * సావధానముగాని సమరసజ్ఞానులై * భావమందునపూర్ణ బ్రహ్మమైనవారే * పావానులన్నా యితరము వారు భావించరన్నా ॥ ౮౦ ॥

క్షేత్రంబులెన్నియైనను క్షేత్రజ్ఞుండొక్కడనుచు * జెప్పను శ్రుతులన్ క్షేత్ర జ్ఞునెరుగనట్టి నపాత్రులకునుదుఃఖమెట్లు * బాయుకుమారా గుణములకోసి వేయు గంభీరా * రోయక నెప్పుడు రోతబ్రతుకేనమ్మి * పాయనిదుఃఖమునుబడువారలకు నెట్లు బాయుకుమారా * గుణములకోసి వేయుగంభీరా ॥ ౮౧ ॥

—(*) పరిపూర్ణబోధ (*)—

యెన్ని విధంబులజెప్పిన పన్నుగ పాపాత్ములకును * పట్టుదుసుమ్మీ కన్నులుమూసి న తెరచిన వున్నదివున్నట్టెయున్నా * దున్నాదో యన్నా అంతటదాని కన్నారగన్నా అన్ని కాలములందు నన్నివస్తువులందు * నన్ని దేశములందు యచలమైకదలక వున్నా దోయన్నా * అంతటదాని కన్నారగన్నా ॥ ౮౨ ॥

ఎందుకుయీసంకల్పము ఎందుకుమాయావిచార * మెందుకుదుఃఖం బెందు కు సందేహంబులు అందముగానీకు నీవే * యమలుడవౌరా యిదివరకున్న భ్రమలెల్ల విడరా * అమలమై నిత్య మనాద్యంతమచలమై విపులముగను వెల్గె * విశ్వసాక్షివినీవై యమలుడవౌరా * యిదివరకున్న భ్రమలెల్లవిడరా ॥ ౮౩ ॥

భావించిచూడగానే నీవంతటనిండియున్న * నిశ్చలమూర్తి యీవింతలకు ను ఝడియక భావించుము నెప్పుడాత్మ * పదముకుమారా నీభ్రమలెల్ల వదలుసుధీరా ముదమున నెప్పుడీ ముజ్జగములగనక * సదమలముగజూడు సత్యముగను పరమ పద ముకుమారా * నీభ్రమలెల్లవదలు సుధీరా ॥ ౮౪ ॥

## [*] అచలలక్షణము [*]

పరిపూర్ణమైన యచలమె * పరమాత్మయటంచు * పరమపదమనిశ్రుతుల్ మురయుచునుచాటుచుండగ * ధరలోపలదీనినెరుగ ధన్యుడోయన్నా * సాధులలోన మాన్యుడోయన్నా * అన్యభావంబుల నన్నివదలియు సామాన్యముగానియీ * మర్మ మెరింగిన ధన్యుడో యన్నా * సాధులలోన, మాన్యుడోయన్నా ॥ ౮౫ ॥

లేదనికలదనియనగా రాదదియెప్పుడును వెలుగు * రమ్యముతోడన్ యే దరిగాననిమనుజుల * వాదంబులుమిధ్యలన్ని వదలుమాయన్నా * మెచ్చరువీటి సదయులువిన్నా * హృదయములోనుండెవ్యధ చల్లబడకను * మదమునవదిరేటి మను జులవార్తలు * వదలుమాయన్నా మెచ్చరు వీటి సదయులువిన్నా ॥ ౮౬ ॥

బట్టబయలాత్మ జేసియు వట్టిదిజగమనుచుజూడ వలయునుసాధుల్ * దెట్టముగ నిట్టుజెయ్యక * మట్టుతనంబుననునున్నా మరిజిక్కదన్నా * భ్రమపాశాన నురికెక్కన్నా * అరిషడ్వర్గములనేనార్గురిశత్రుల * చరలో మోహంబనే సంకెళ్లదగిలియు, మరిజిక్కన్నా * భ్రమపాశాన నురికెక్కన్నా ॥ ౮౭ ॥

శృతిదృష్టాంతములేకను మతిహీనులుబల్కనట్టి * మాటలనెల్లన్ సతమనిన మ్మకనీలో యతులితముగ వెలిగెవెల్గు * ననయముగనరా నీలోననీ యనుమానమిడరా * మనుసు చంచలముల మానియునెపుడాత్మ * ఘనసచ్చిదానంద కైవల్యప దవి నీవనయముగనరా * నీలోననీ యనుమానమిడరా ॥ ౮౮ ॥

జలమధ్యంబునమత్స్యం బలతేరుచు దాహమునకు * నదియుండుగతిన్ సలలితముగపరమాత్మలో * గలిగున్న దిసర్వమనుచు గనలేకపుత్రా * గురువా క్యము వినలేకపుత్రా * అనయాముపరమాత్మ నరయుదామనియెన్నో * ఘనయో గాభ్యాసాది కర్మముల్ జేసియు * గనలేకపుత్రా గురువాక్యము వినలేకపుత్రా ॥ ౮౯

మనసేసర్వజగంబులు మనసేయీసర్వమైన * మాయలునుమ్మా మనసేచిత్ర ములెల్లను * మనసునువిడనాడిమేలు మరిగానవన్నా * అంతట నీవేపరిపూర్ణమన్నా అరిషడ్వర్గములను నతులితముగద్రుంచి పరిపరివిధముల పరుగుబెట్టకమేలు * మరిగా నవన్నా అంతటనీవే * పరిపూర్ణమన్నా ॥ ౯౦ ॥

నీలోనగలిగిజగమును నీలోనను నుండిమరియు * నీలోనణగు నీలోనిచిత్ర
ములను * యాలోచనజయ్యనేలా * యురగవావత్సా * నీయరుకను మరువాకు
వత్సా యెరుకమరుపుల రెంటి నెరిగేటియెరుకవై * యెరుకేపరిపూర్ణమం * చేసంకల్ప
ములేక ..నె రగవావత్సా * నీయెరుకను మరువాకువత్సా ॥ ౯౧ ॥

దేహాభ్రిమలనువిడకను * సాహసమున ముక్తిబొంద-శక్యంబగునా * మో
హంబులెల్లదీరిన * బాహాటముగానునతడే పరమాత్ముడన్నా * మాయకుతాను వెరు
వాడోయన్నా * పరమార్థమెప్పుడు భావించుచుండితా * నిరుపద్రవంబైన నిజబో
ధదెలసిన పరమాత్ముడన్నా * మాయకుతాను వెరువాడోయన్నా ॥ ౯౨ ॥

అదియిదిగాదనికొందరు * యిదియదిగాదంచుకొంద రిలలోమూర్ఖుల్ * యి
దిలేనిది, యిదిగలదని * పదపడివది రేటిబోధ పాటిగాదన్నా * నీబోధాతో సాటిరా
దన్నా * అదెయిది యిదెయది యనుచునొక్కటిగను మదిదలపొయ్యని * మాయా
వాదులబోధ పాటిగాదన్నా * నీబోధాతో సాటిరాదన్నా ॥ ౯౩ ॥

అచలంబనగనువేరా * యచలంబననీవెగావె * యమలుడవైనట్టి అచలా
యచలముజూచుక * సుచరితమౌబోధయందు * సాటివప్పకురా అచలంబును పా
టించికనరా * బూటకముల కెపుడు పోబోకయచలమై * పాటించిననునీవె * పరిపూ
ర్ణముగ నెపుడు * పాటించికనరా * అచలంబను పాటించికనరా ॥ ౯౪ ॥

తానవగలేనివాడని * మానసమున నెంచనేల * మరిసాధులకున్ తానవగ
తానెపూర్ణం * బేననిచలనంబులుడిగి * యెరిగియుండువత్సా * యీబోధను మరిగియుండు
వత్సా * యెరుకేపరిపూర్ణము యెరుకేబ్రహ్మంబని * యెరుకేనిత్యంబని యేమారక
నునీవు యెరిగియుండువత్సా * యీబోధను మరిగియుండువత్సా ॥ ౯౫ ॥

(*) ఎరుకలక్షణము (*)

ఎరుకేతానునుచునుజగ * మెరుగకతనుదానెపూర్ణ మైనచలంబై * యరుగ
నియటువలెవుండుట * పరిపూర్ణంబనగనిదియె పాటించికనరా * నీవీయొక్క సాటిద
ప్పకురా * మాటలువెయ్యేల మాయావాదులయొక్క * బూటకములనీవు బోకస
ద్గురుబోధ * పాటించికనరా, నీవీయొక్క సాటిదప్పకురా ॥ ౯౬ ॥

అందునినిందునననకను ఎందునజూచినసుపూర్ణ * మెడతెగకుండుఁ సందే హామేమిలేకను నెందేమరిబొందకుండ * నిరతమువెల్గు యీమర్మామునుమరువక నెరుగూ * యెరుకనేనెరిగియీ యెరుకమరువులనెరిగె * యెరుకపరిపూర్ణమం చేభ్రమల బొందక * నిరతమువెల్గూ యీమర్మము మరువాక నెరుగూ ॥ ౯౭ ॥

ఎరుకేబ్రహ్మంబనికను నరవరులకునెప్పటికిని * నయముగజన్మం బెరుగంగ రాదటంచును * విరివిగశాస్త్రంబుబలుకు వినరాకుమారా అచలమునీలో గనరాకుమారా * మనసందుయీబోధ మానకనెప్పుడు అనుమానమునులేక * నాత్మతత్వము నాచే వినరాకుమారా * అచలమునీలో గనరాకుమారా ॥ ౯౮ ॥

మనసుజనించకమునుపుఁ మనసున్నప్పుడునుమరియు * మనసణగంగఁ మనసును దెలియక కదలక * పరిపూర్ణంబుండుదాని భావించుపుత్రా * అచలమునెపుడు సేవించుపుత్రా * యేవిధముననైన యీ రొయుక్కమనసును * భావించకను బట్టబయలేబ్రహ్మమటంచు * భావించుపుత్రా అచలమునెపుడు సేవించుపుత్రా ॥ ౯౯ ॥

కలవంటిదిమానసమని చలనంబుల నెల్లవిడిచి * సద్గురుకృపచే మలినపు సంసారములో పలబడకుండగనుముక్తి * షద్ధాతిగనుమీ లోకులయొక్క సుద్దులుడుగుమీ * కద్దులేదనకెల్ల కాలామునొకరీతి * సుద్దులెరుగకను తా సుస్థిరముగవెలెషద్ధాతిగనుమీ * లోకులయొక్క సుద్దులుడుగుమీ ॥ ౧౦౦ ॥

జ్ఞానులమనుకొందరు మానసమునువిడువలేని * మందులుధరలో పూనిగనుంగొనగలరే జ్ఞానంబునువారలెంత * ఘనులైనపుత్రా వారలబోధ వినకుసుపుత్రా * మానసమనియేటి మర్కటమునుదరిగే * కాననముసజిక్కి కష్టామొందుచునెంతా * ఘనులైనపుత్రా వారలబోధ వినకుసుపుత్రా ॥ ౧౦౧ ॥

తానసగలేనివాడని మానసమునసెంచనేల * మరిసాధులకుఁ తానగతానెపూర్ణం బేననిచలనంబులుడిగి * యరిగుండువత్సా యీబోధాను మరిగుండువత్సా * యెరుకేపరిపూర్ణమం చెరుకేబ్రహ్మంబంచు * యెరుకామరువులనెరిగే యెరుకే అచలమాని * యరిగుండువత్సా యీబోధాను మరిగుండువత్సా ॥ ౧౦౨ ॥

మనసేసుఖదుఃఖంబులు మనసేమూలంబుసర్వమాయలకెల్లఁ * మనసేనింద్రియవృత్తులు మనసేచిత్రంబులంచు * మనసునువిడరా నీలోనిన్ను ననయముగన

రా * మనసూమనసున నెరగి మనసుమనసునద్రుంచి * మనసుకతీతమా మార్గమె రిగినీవు మనసునువిడరా * నీలోనిన్ను ననయముగనరా ॥ ౧౦౩ ॥

[)•( గ్రంథ పూర్తి )•(]

వంచకులకు ధూర్తులకును సంచితకర్మముల విడువ * జాలకనుండే పంచేంద్రియలోలులకును అంచితముగనిట్టిమర్మ * మగుపరచవలదూ దూషకులాకు దగ దెల్పదగదూ * జగములభ్రిమయున్న జపములభ్రిమయున్న * సగుణోపాసన లందు చాలమోహములున్న * నగుపఱచ వలదూ దూషకులకు దగదెల్ప దగదూ ॥ ౧౦౪ ॥

సత్యంబులేనివారికి కృత్యంబెదదల్పునట్టి కుటిలాత్ములకుఁ * వృత్యంతరములనుండిన సత్యంతమెమోక్షభ్రాంత్తు * లైనయీబోధా వారికిసర్వమానుమిగాధా * మానాభిమానములు మరివిడువగాలేక * ధ్యానాసక్తులునైన దండివిద్వాంసుల * కైనయీబోధా వారికిసర్వ మానుమిగాధా ॥ ౧౦౫ ॥

గురువులకెదిరించెడియా నరులకు దెలుపంగవలదు నయముగనీవా * దురితాత్ములకునుదెల్పిన ధరలోపామునకుపాలు * దగబోశినట్లూ కటికెకుగోవు తెగనమ్మినట్లూ * జగతిలోజ్ఞానుల చర్యాలుదూషించి * బుగులులేకతిరిగే పుణ్యహీనులకుపాలు * దగబోశినట్లు కటికెకుగోవు తెగనమ్మినట్లు ॥ ౧౦౬ ॥

[)•( కుజన లక్షణము )•(]

గురువాక్యంబునుమదిలో మరచియనుష్ఠించనట్టి మాయకుదేహుడుఁ * నరకంబుననుభవించును యరమరలేకుండనీశు * డనలేదాపుత్రా గురుగీతాలో వినలేదాపుత్రా * మనమునగురుబోధ మరువాకనుష్ఠించు * ఘనులేపాపములాని నరకంబు డంబాతో * ననలేదాపుత్రా గురుగీతాలో వినలేదాపుత్రా ॥ ౧౦౭ ॥

గురునాథుడుకోపించిన గురురాయుని కెదురుబల్కు కుటిలాత్ములకుఁ * నరకంబుసిద్ధమనుచును నరకంబుదుబల్కుచుండు * గాంచుకొమారా నీలోనయోచించుసుధీరా * అంచీతముగ పరమాత్మసద్గురుడాని * యంచాకతిరిగేటి వంచకులగువారి * గాంచుకుమారా నీలోన యోచించుసుధీరా ॥ ౧౦౮ ॥

అన్నముబెట్టినవారిని పన్నుగదూషించునట్టి పాపాత్ములకైన్ * తిన్నగసద్గురువులచే సన్నియుతాదెలసి యధము * ఖతనిదూషించూ దృష్టులకెల్ల హితవాచరించూ * మతిహీనులటువాలె మదమత్సరములాను * సతతాముదగిలీయు సద్గూరునెరుగాకా * నతనీదూషించూ దృష్టులకెల్ల హితవాచరించూ ‖ ౧౦౯ ‖

గురువాక్యమనుష్ఠించక గురువులదుర్గుణములెంచు కుటిలాత్ములిలన్ * పరిపరి విధములదుఃఖము లరమరలేకుండబొందె * దదిగానవన్నా జ్ఞానులకదిముదముగా దన్నా * మదమత్సరములను మరిగిసద్గురుదూరు * అధమాధములెప్పు డడలుచు దుఃఖించె * దదిగానవన్నా జ్ఞానులకది ముదముగ దన్నా ‖ ౧౧౦ ‖

—[)♦( సుజనలక్షణము )♦(]—

మంత్రిమెసద్గురుమూర్తియు మంత్రార్థంబతనిరూపు * మరిగురువరుడే మంత్రాధిపతియుసద్గురు మంత్రంబేగన్నమేలూ * మరువకోయన్నా యిదిదృఢమైతె ధరమాయసున్నా * అగమరలేక తానంతవానిగశిష్య * వరుజేశిన గురువరునీమేలాత్మలో * మరువాకోయన్నా యిదిదృఢమైతె ధరమాయసున్నా ‖ ౧౧౧ ‖

అధముమతాన్నైయుండగ మదమునసద్గురునువీని మూర్ఖతిమిరమున్ * వదలించ బోధభానుండదయించెనుగాకవేరే * యున్నాదాపుత్రా గాంచుమిగురుణి తిన్నగపుత్రా * మన్ననతోమదిమర్వాకసద్గురుడె * పన్నగధరుడాని భావించకను మోక్ష * మున్నాదాపుత్రా గాంచుమిగురుని తిన్నగపుత్రా ‖ ౧౧౨ ‖

ఆస్తికునకెవ్వరైనను సుస్థిరమునదెల్పవచ్చు సుజ్ఞానంబున్ * నాస్తికునకైన నటువలె నీస్థితిదెలుపంగరాదు * నిజముకుమారా వినువకయాత్మ * భజనసుధీరా అజహరిహరులైన యాస్తినాస్తికునాకూ * సుజనులమార్గాము జూపిదెల్పగలేరు * నిజముకుమారా వినువకయాత్మ భజనసుధీరా ‖ ౧౧౩ ‖

జ్ఞానులచర్యలువింతలు మానితముగవారిదెలియ మర్త్యులవశమా * జ్ఞానులకుబుద్ధిజెప్పెడి హీనులవిడనాడినీదూ * హితులానుగూడూ దుర్మార్గాల సతతాముపీడూ * మతిలోనీవెప్పుడు మర్మాములుంచాక * సతతాముజ్ఞానూల సేవజేయుచునీదూ * హితులానుగూడూ దుర్మార్గాల సతతాముపీడూ ‖ ౧౧౩ ‖

[ గురుదత్తాభయదానము ]

పరిపూర్ణమైనయచలం * బరమరలేకుండనేనె * యనినీయాత్మక్ * వర భూమానందుడవై * నిరతమునీలోనసీవే * నిండుకుమారా * యిదిమరువాక నుండుసుధీరా * పండువెన్నెలవాలె * పరమార్థమెప్పుడా * ఖండామైనటువంటి యాత్మసమాధిలో * నిండుకుమారా * యిదిమరువాక * నుండుసుధీరా ॥ ౧౧౫ ॥

[ శిష్యవిజ్ఞాపనము ]

గురువరుడిటువలెశిష్యుని * కిరవొందగపూర్ణబోధ * నింపుగజేయన్ * పరమానందమునొందియు * వరదేశికుచరణములకు వందనమునెనూ * అప్పుడుపూర్ణా * నందముతోనూ * వందేహంగురునాథ * వాసవార్చితయని * సందేహములుబాశి సద్గురుమూర్తికి * వందనమునెనూ అప్పుడుపూర్ణానందముతోనూ ॥ ౧౧౬ ॥

[ కవివంశానుక్రమణిక ]

ధరలోవేపురువంశో * ద్భవుడా సరసిహ్మాంనెడు * ధన్యునిసతియా * వర వెంకమాంబకునునే * హరువరమునబుట్టినట్టి * యన్నయాఖ్యుడనూ * సద్గురుమూర్తి మన్ననతోనూ * అన్నానఘూతయంచార్యులు బోగుడాగ * నున్నదున్నట్లుగా నుడివితగనుడినే * నన్నయాఖ్యుడనూ * సద్గురుమూర్తి మన్ననతోనూ ॥ ౧౧౭ ॥

[ గ్రంథసారాంశము ]

యీకందార్థములెప్పుడు * సాకల్యంబుగనువేద * సారంబనుచున్ * చేకొని చదివెటిసుజనులు * నాకటముగవారెపతిత * పావనులయ్యా * దీనిమది భావించరయ్యా * కేవలముగను యీకీలుదెలసితము * భావమందునపూర్ణ బ్రహ్మమైనవారె పావనులయ్యా * దీనిమది భావించరయ్యా ॥ ౧౧౮ ॥ * *

[ గ్రంథసమాప్తి ]

లింగాంగభంగముయ్యో * సంగములేకుండవెల్గు * సత్యానందున్ * పొంగుచునాత్మస్పణముగా * మంగళమునిపాడరయ్య * మరిమరిజనులూ * పాడరె మీరు మురయుమఘునులూ * పరిపూర్ణనిర్గుణబ్రహ్మమాగురునకు * నిరతామోడ తెగకుండ నిత్యశోభనమాని * మరిమారిజనులూ * పాడరెమీరు * మురయుమఘునులూ ॥ ౧౨౦ ॥ * * * * * *



శ్రీరస్తు

## శివజ్ఞానాష్టకస్తోత్రం

శ్లో॥ అకారోహ్యుకారోమకారస్తురీయస్త్రి వస్థాదికం కత్రయమ్వ్యష్టిభూతం ।
సమస్తంస్వవాచ్యార్థమిత్యాస్వరూపంపరబ్రహ్మ లక్ష్యార్థమేకంశివోహం ॥

శ్లో॥ నగోత్రన్నశీలన్నమేజాతిభేదాః నమాతాపితావానమేశత్రుమిత్రే ।
నచాదిర్నమధ్యం నచాంత్యంనరూపం । పరబ్రహ్మలక్ష్యార్థమేకంశివోహం॥

శ్లో॥ దినన్నైవమేనైవరాత్రిర్న సంధ్యానకాలోనస్నానం నమంత్రోనహోమః।
సదాత్యేకమాద్యంతశూన్యంలసత్తంపరబ్రహ్మలక్ష్యార్థమేకంశివోహం ॥

శ్లో॥ నమేచాక్షిజిహ్వాత్వచంఘ్రాణకర్ణౌ నవాక్పాణిపాదౌనచోపస్థపాయూ ।
నమేపంచప్రాణానమేస్థూలసూక్ష్మౌపరబ్రహ్మలక్ష్యార్థమేకంశివోహం ॥

శ్లో॥ నమేకింకరోనమేపద్మయోనిర్న చాత్మాపరాత్మానజీవోనచేశః ।
నమేసద్గురుశిష్యదేవౌనభక్తః పరబ్రహ్మలక్ష్యార్థమేకంశివోహం ॥

శ్లో॥ నచాహంనచిత్తంనమేబుద్ధిరూపం నమేమానసన్నపతా, త్రిమూర్తిః ।
నిరస్తాతిసర్వన్నిరాభాసతుర్యమ్పరబ్రహ్మలక్ష్యార్థమేకంశివోహం ॥

శ్లో॥ నచాస్తిర్నభాతిర్నచానన్దరూపన్ననాస్తిర్నధర్మశ్చమేకర్మసంజ్ఞే ।
నచోపాధిసత్యన్నసత్యన్నదేహఃపరబ్రహ్మలక్ష్యార్థమేకంశివోహం ॥

శ్లో॥ పరబ్రహ్మచైకమ్పరంజ్యోతిరేవన్న వాచ్యార్థలక్ష్యార్థభావన్నిరస్తం ।
ఇదంసర్వమాయామయంద్వైతజాలమ్పరబ్రహ్మలక్ష్యార్థమేకంశివోహం ॥

శ్లో॥ అన్నయార్యకృత స్తోత్రంశివజ్ఞానాష్టకంసదా ।
యఃపఠేద్భక్తిసంయుక్తస్సయాతిపరమాంగతిం ॥

ఇతిశ్రీమత్పరమభూమానందయోగీంద్ర శ్రీమదన్నావధూతవిరచిత

శివజ్ఞానాష్టకస్తోత్రంసమాప్తః

ఓంతత్సత్



శ్రీ గురుభ్యోనమః

# చరమానుష్ఠానం

శ్రీమదఖండ పరిపూర్ణా ద్వితీయ బ్రహ్మంబునం దేతద్విశ్వంబుద్భవించె లేనిదైనను దోచుచున్నదానిని నెండమావుల జలంబులనఁగఁదోచి తద్భ్రాంతిరహితంబైన నెండమావుల నెండమావులైన యిలనీజగద్భ్రాంతి రహితంబైన పరిపూర్ణంబొక్కటియే సాక్షాత్కారంబగు నిందుకు సందేహంబులేదు సముద్రంబున తరంగంబులుంబొడమి వెంటనే సముద్రంబున లయంబగునటుల నీవిశ్వంబా పరిపూర్ణంబునందుదోచి దానియందే లయంబగు నిందుకు సమ్మతి, శ్రుతి ॥ శ్లో ॥ యథాఫేనతరంగాది సముద్రాదుద్భితః పునః సముద్రేలీయతే తద్వత్ జగన్మయ్యనుతీయతే ॥ యీప్రకారంబున శ్రుతిపలుకుగాన కేవలాత్మయందీ ప్రపంచంబు సంకల్పరూపంబుగా దోచి తత్సంకల్పంబు రహితంబైన నీజగంబే మియ్యుం దోచకుండు స్వప్నావస్థయందనేకచిత్ర విచిత్రములైన లోకంబులును, లోకపాలకులును, స్త్రీపురుష నపుంసకులగు మానవులును, పశుపక్షి క్రిమికీటకాది నానాజంతు నివాసంబులును, జార చోర భృత్య మిత్ర కళత్ర పుత్ర పౌత్రా ద్యనేక సంఘంబులును నానావిధ భేదవాదంబులును వేదశబ్దశాస్త్ర పురాణేతిహాసంబులును, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రా ద్యనేక జాతులును, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, యత్యా ద్యనేకాశ్రమంబులును, వర్ణాశ్రమధర్మంబులకు దగినశాస్త్రంబులును, రథ గజ తురగ పదాతుల నెడి చతురంగబలంబులును వైదిక లౌకికాద్యాచారంబులును, వైరాగ్య న్యాయ శృంగారంబుల నెడి త్రివిధప్రమాణంబులును, శైవ, వైష్ణవ శాక్తేయ గాణాపత్య సౌర కాపాలికాద్యనేక మతంబులును, యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగ యోగంబులును, గురుశిష్యభావంబు లనేకంబులు తనంతటతామేదోచి యిట్టివిచిత్రంబు లెచ్చటనుండివచ్చి యెచ్చటనున్నవి తెలియక తద్భ్రాంతిబద్ధుండైన కేవలాత్ముండు కొంతదడవు తానొకదేహంబుధరించినటుల తద్దేహంబే తాననుకొని తన్మరచి యనేకజన్మంబులెత్తినట్లున్ను సంసారబద్ధుండై సంసారమేనిత్యమని మోసపోయి దుఃఖించినట్లున్ను అంత

కొంతకాలంబునకు సజ్జనసహవాసంబుచేతను ధరించిన దేహంబునకు తాను వేరుగా నుండే జీవుండనుకొనినట్లున్ను అంతకు తనపూర్వాకృత పుణ్యమువలన నొకానొక బ్రహ్మవేత్త సందర్శనంబుచేత నితనికి జన్మసాఫల్యంబై సాధనచతుష్టయ సంపద్విశిష్టుండై బ్రహ్మవిచారాధికారుండైనట్లున్ను, బ్రహ్మవిచారానంతరమందు తానుసర్వభ్రాంతిశూన్యుండైనట్లున్ను, అంతరంగబాహ్యాంగములయందు కరతలామలకంబుగాతానేప్రకాశించినట్లున్ను, తనకన్న కించిత్తయిన నితరపదార్థంబుజూడకుండా నిర్వికల్పసమాధినొందినట్లున్ను, అనేకవిధంబుల స్వప్నంబున భ్రాంతిబద్ధుండై మేలుకొనిన నిన్నిటిలో నొక్కటైన మిగతలేకుండా నెచ్చటికిబోయెనో తెలియదు కాని స్వప్నంబెఱిగినవాడే నిలుచును గావున స్వప్నము కలుగకమునుపున్ను, స్వప్నమందున్ను, స్వప్నరహితానంతరమందున్ను, తానొక్కడేప్రకాశించుచున్నాడని తన్ను దా దెలిసి యితరవాంఛలరోసి సర్వదేశ సర్వకాల సర్వావస్థల యందంతట తానేపరిపూర్ణాద్వితీయబ్రహ్మ సాక్షాత్కారంబుగా దెలిసి, తెలిసిన తెలివిని మరువక నియఖండభావంబున నిశ్చలుండై యుండుటే పరమమోక్షంబు, నిదియేజీవన్ముక్తి, నిదియేఅపరోక్షజ్ఞానంబు విచారించిన విచారించకున్న, సర్వకాలంబెడతెగకుండ, ప్రకాశించేపరిపూర్ణాద్వితీయ బ్రహ్మమే తానగు నింతకు సందేహంబులేదు.

చరమానుష్ఠానం సంపూర్ణం

గద్య

ఇయ్యది శ్రీమద్వేవురువంశ పయఃపారావార రాకాసుధాకర
వంజరికులపవిత్రి నృసింహార్యపుత్రి శ్రీరాజరాజేశ్వరీ వరప్ర
సాదజనిత సరసకవిత్వవైభవ ,,అఖండభూమండలసాధు
మండనోత్ప్రహద్విశిష్టాన్వయ సింధుచంద్రిమ విద్యా
నిధి సత్వసుభాషణోజ్వల" త్యాదిబిరుదాంకిత
అన్నావధూత ఆత్మవిలాసిశాలియని ప్రసిద్ధి
జెందిన పరమభూమానంద యోగీంద్ర
ప్రణీతంబైన అఖండానందబోధయను
అన్నావధూత అనుభవ ప్రకాశిక
సర్వంబునేకాశ్వాసంబు
సంపూర్ణము